# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

జనవరి '98



వెల. 5-00

# సంపాదకీయము

"నేడు రాజకీయాలు ఎండుటాకులలా గాలి ఎటువీస్తే అటుపోతున్నాయి, కలుషితమైనాయి. పూర్వం రాజకీయాలలో 'రాజనీతి' ఉండేది. నేడు ఓటుకోసం నీతిని తాకట్టు పెడుతున్నారు. పూర్వపు రాజకీయనాయకులకు దేశాభిమానం ఉండేది. అది రాను,రాను ప్రాంతీయాభిమానంగాను, గ్రామాభిమానంగాను, కులాభిమానంగాను మారుతూ.....మారుతూ..... చిట్టచివరికి దేహాభిమానం వరకు దిగజారారు." అని శ్రీ సత్యసాయిబాబావారు ది. 10-3-87న ప్రశాంతి నిలయంలో ఒక ఇంటర్వ్యూలో నాతో అన్నమాటలు అవి. బాబావారు పది సంవత్సరాల క్రిందటనే భారత రాజకీయరంగమును సునిశితంగా పరిశీలించి అభిప్రాయమును వెలిబుచ్చారనటంలో ఏమాత్రం సందేహం లేదు. ఈనాటి భారత రాజకీయరంగమును పరిశీలిస్తే పరిస్థితి ఇంకా మరింతగా దిగజారిందని చెప్పవచ్చును.

ఈనాడు నాయకులలో చాలామంది దేశాభిమానమును విస్మరిస్తున్నారు. దేహాభిమానమును పెంచుకుంటున్నారు. నీతిని విస్మరిస్తున్నారు, అవినీతిని ప్రోత్సహిస్తున్నారు. 'హరి'కి కాదు, సిరికి దాసులవుతున్నారు. గుణమునకు తిలోదకాలిస్తున్నారు, ధనమునకు దాసోహమంటున్నారు, అవినీతి వికటాట్టహాసం చేస్తున్నది, నైతిక విలువలు నానాటికి దిగజారిపోతున్నాయి. దేశసంపద స్వార్థపరుల చేతులలోనికి పోతున్నది. దేశ ప్రగతి దెబ్బతింటున్నది, వ్యక్తిగత ప్రగతి మాత్రం పెరుగుతున్నది.

**"కాకులు, చీమలలో ఉన్నది ఐకమత్యము (Unity). కాని ఈనాటి మానవులలో ఆ ఐకమత్యము లేకుండా పోతున్నది. ఏపనినైనా సాధించాలంటే Unity అత్యవసరం. Unity (ఐకమత్యం) మనలో వచ్చినప్పుడే Purity (పవిత్రత) ఏర్పడుతుంది. Purity (పవిత్రత) మనలో ఉన్నప్పుడే Divinity (దివ్యత్వం) మనలో ఉద్భవిస్తుంది. అయితే ఈనాటి మానవులలో Unity లేదు, Purity అంతకన్నా లేదు, Divinity అసలే లేదు. ఉన్నదల్లా ఈనాడు Community (కులం) మాత్రమే"** ఒక చిన్న బెల్లం ముక్కను చూచిన చీమ తానే తినదు. కొన్ని వందల చీమలను చేర్చి అన్నీ కలిసి మోసుకొనిపోయి కలిసి తింటాయి చీమలు. ఎంగిలి మెతుకులను చూచిన కాకి తానొక్కటే తినదు. "కా.....కా....." అని పిలిచి పదికాకులను చేర్చి కలిసి తింటాయి కాకులు. అయితే మానవుడు మాత్రం తద్విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడు. ఏదైనా ఒక వస్తువు బజారులో దొరికితే, ఎవరికీ చెప్పకుండా దానిని సంగ్రహించి, దాచిపెట్టుకుంటాడు. పరులకు చూపించడు, చెప్పడు, పెట్టడు, చీమలలో, కాకులలో ఉన్న ఉదారబుద్ధి, సంఘీభావం ఈనాడు మానవులలో ఏమాత్రం కనిపించటం లేదు. ఇది ఈనాటి స్వర్ణభారతి స్థితి, దుస్థితి.

o

**"ప్రాణమునకు నీతి సారము. జీవితమునకు ఆదర్శము నీతి. నీతి లేకున్న జాతి చెడును. నీతియే నీ జాతి. అది వదలితివో నీవు కోతి కంటె హీనుడవవుతావు"** అంటారు బాబా.

జాతికి నీతి ముఖ్యము. ఏ జాతి అయినా బాగుపడాలంటే ఆ జాతి ప్రజల ప్రవర్తన మీద ఆధారపడి ఉంటుంది. నీతి లేనివాడు ఎంత గొప్పవాడైనా, ఎంత గొప్ప సైంటిస్టు అయినా, ఎంత గొప్ప మేధావి అయినా, ఎంత గొప్ప రాజకీయ నాయకుడైనా ప్రయోజనం లేదు. అటువంటి వారి వలన ఆ దేశమునకు ఏమాత్రం మంచి చేకూరకపోగా అప్రదిష్ట వచ్చి తీరుతుంది. కనుక ప్రతి ఒక్కరూ నీతి నిజాయితీలను పెంపొందించుకుంటూ, నీతి నిజాయితీపరులకు మాత్రమే ఈ దేశ పరిపాలన బాధ్యత వప్పగించుతారని ఆశిస్తున్నాను, విశ్వసిస్తున్నాను.

**"జాతి గౌరవంబు నీతిపై నిలుచును**
**నీతి లేక యున్న జాతి చెడును**
**నీతి గల్గు జాతి నిజమైన జాతిరా**
**వినుము భారతీయ వీరసుతుడా!"** - బాబా

- కొమరగిరి కృష్ణమోహనరావు

జనవరి 1998
సంపుటి 14 సంచిక 1

# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
© 22818, 21137.

Cheques & Drafts should be drawn in favour of **"SREEVANI"** Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

Printed at
***SREEVANI OFFSET PRINTERS***
Machilipatnam

Despatched on
**7-1-1998**

## విషయసూచిక

| | | |
|---|---|---|
| అమృత వాణి | కూచిభట్ల చంద్రశేఖర శర్మ | 2 |
| గృహస్థధర్మమును పాటించండి! పిల్లలను ఆదర్శవంతులుగా తీర్చిదిద్దండి | భగవాన్ సాయి దివ్యబోధ | 3 |
| తాత్త్వికుడు జిడ్డుకృష్ణమూర్తి | డా॥ రాపర్ల జనార్దనరావు | 9 |
| జంకిన విద్వాంసుడు | ఎన్.వి.ఆర్.సత్యనారాయణమూర్తి | 11 |
| సంక్రాంతిలక్ష్మి | కొమరగిరి జయప్రద | 12 |
| దేవి వినుతివీణ | పృథివి | 13 |
| విశ్వరూప సందర్శనయోగం | వాడవల్లి విజయలక్ష్మి | 14 |
| బ్రహ్మచారిణి | పురాణపండ రాధాకృష్ణమూర్తి | 15 |
| మనోభిరామం - 24 | సోమంచిరామం | 16 |
| రసవద్ఘట్టాలు - 33 | జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 17 |
| గ్రంథపరిశీలన | ముదిగొండ వీరభద్రయ్య | 18 |
| సైన్స్‌వాణి - 23 | కె.ఆర్.కె.మోహన్ | 19 |
| వ్యక్తులు - వ్యక్తిత్వాలు - 88 | కంచివాసుదేవరావు | 20 |
| పదాలపందిరి - 8 | కిరీటి | 22 |
| యువతావాణి - 20 | కీ॥శే॥ ఆర్.ఎస్.కె. మూర్తి | 23 |
| భగవాన్‌సాయిమహిమలు | డి. వెంకటేశ్వరరావు | 25 |
| ఎందరోమహానుభావులు-13 | భండారుపర్వతాలరావు | 27 |
| సాంస్కృతిక సమారాధన | జనారా | 28 |
| అగంతకుడు | చింతపల్లి అన్నపూర్ణ | 32 |

ముఖచిత్రం : **మేటి తాత్త్వికుడు జిడ్డు కృష్ణమూర్తి**

# అమృతవాణి

**కూచిభట్ల చంద్రశేఖర శర్మ**

శ్లో॥ ఆనందం సదనం, సుతాశ్చ సుధియః, కాంతా నదుర్భాషిణీ,
సన్మిత్రం, సుధనం, స్వయోషితిరతిః, చాజ్ఞాపరాః సేవకాః,
ఆతిథ్యం, శివపూజనం, మిష్టాన్నపానం గృహే,
.సాధోస్సంగముపాసతేచ సతతం ధన్యోగృహస్థాశ్రమః॥

నిజం చెప్పాలంటే అన్ని ఆశ్రమాల్లోకి గృహస్థాశ్రమం చాలా దొడ్డది. సన్యాసం అన్నింటికంటే గొప్పదైనా అన్ని ఆశ్రమాలవాళ్ళకు ఆధారం మాత్రం గృహస్థాశ్రమం. అందుకనే అది దొడ్డదనటం.

రోజూ పంచయజ్ఞాలు చేస్తూ పరమపవిత్రంగా జీవితం గడపటం గృహస్థ ధర్మం. ఒక మహావృక్షాన్ని ఆశ్రయించి రకరకాల పక్షులు ఎలా సుఖంగా జీవిస్తూంటాయో, అలాగే గృహస్థునాశ్రయించి వివిధ ఆశ్రమాలవారు సుఖజీవనం చేస్తారు. గృహస్థు వల్లనే దేవతలు తృప్తిపడతారు. పితరులు తరిస్తారు. అతిథి అభ్యాగతులకు ఆతిథ్యం దొరుకుతుంది. అయితే ధర్మబద్ధంగా ప్రవర్తించినప్పుడే గృహస్థాశ్రమం స్వర్గధామమవుతుంది. లేకపోతే నరకమే. వేదవిహిత ధర్మానుష్ఠానం గృహస్థాశ్రమానికి వెన్నెముక వంటిది. భార్య అనుకూలంగా సహధర్మచారిణి అయినప్పుడే గార్హస్థ్యం ఫలిస్తుంది. ఎడ్డెం అంటే తెడ్డెం అనే చండిక కాకూడదు. ఇంట్లో ఈగలమోత ఉండకూడదు. ఎప్పుడూ ఇల్లు ఆనందసదనం కావాలి. చెప్పిన మాట వినే పుత్రులున్నప్పుడే బాగుంటుంది. అంటే కొడుకులుండగా సరికాదు వాళ్ళు బుద్ధిమంతులు కావాలన్నమాట. ఆస్తికోసం అమ్మానాన్నలు ఎప్పుడు మరణిస్తారా అని నిరీక్షించే కొడుకులు కొడుకులు కారు. వాళ్ళ వల్ల గృహస్థు సుఖపడడు.

అలాగే గృహస్థుకు దొరికే మిత్రులందరూ సన్మిత్రులయినప్పుడే సుఖం. కపటంగా ప్రయోజనం కోసం స్నేహం చేసేవాళ్ళున్నటికీ మిత్రులుకారు.

ధర్మ ప్రవర్తనతో నీతినిజాయితీలతో ధనసంపాదన చేస్తేనే అది గృహస్థుకు ఇహపర సుఖాన్ని ఇస్తుంది. అదే మంచిధనం అనిపించుకొంటుంది.

గృహస్థుడయినవాడు ఏకపత్నీవ్రతుడు కావాలి. తన భార్యయందే అనురక్తుడు కావటం గృహస్థ ధర్మం.

ఇక సేవకులున్నారంటే వాళ్ళు చెప్పినది చేసేవాళ్ళు కావాలి. చూచిరమ్మంటే కాల్చివచ్చేవాళ్ళు, పుల్లయ్య వేంవారం వెళ్ళినట్లు చేసేవాళ్ళు కాకూడదు. అంటే విధేయులయిన సేవకజనం దొరకటం కూడా విశేషమే.

ఈ విధంగా స్వీకరించిన గృహస్థాశ్రమం ధన్యం కావాలంటే ఇల్లు ఆనందనిలయం కావాలి. పుత్రులు బుద్ధిమంతులై ఉండాలి. కట్టుకున్న భార్య దుర్భాషలాడేది కాక ప్రియభాషిణి కావాలి. మంచి మిత్రులు దొరకాలి. సక్రమ పద్ధతిలో ధనం సంపాదించాలి. తన భార్యయందే అనురక్తి నిలవాలి. ఆజ్ఞ పాటించే సేవకజనం ఉండాలి, అంతేకాక అతిథి, అభ్యాగతులను గౌరవించాలి. రోజూ శివార్చనం జరగాలి. పరిశుద్ధమైన అన్నపానాలు లభించాలి. ఇంట్లో నిత్యమూ సత్సాంగత్యం జరగాలి. ఇవన్నీ సమకూరినప్పుడు గృహస్థాశ్రమం ధన్యమౌతుంది. గృహస్థు చరితార్థుడవుతాడు. 






# గృహస్థ ధర్మమును పాటించండి! పిల్లలను ఆదర్శవంతులుగా తీర్చిదిద్దండి!!

"సర్వరూప ధరం శాంతం
సర్వనామ ధరం శివం
సచ్చిదానంద రూపం అద్వైతం
సత్యం శివం సుందరం"

ప్రేమ స్వరూపులారా!

ప్రపంచమంతయూ సత్యముతోనే నిండి ఉన్నది. జీవరాసులన్నియు కూడనూ ధర్మముతోనే కూడి ఉన్నవి. కనుక జగత్ అంతయూ సత్, చిత్, ఆనందమయమే, అంతయూ దైవస్వరూపమే, వేదములకు తల్లి గాయత్రి. వేదములకు మాతృమూర్తి గాయత్రి. ఈ మాతృమూర్తి యొక్క స్వరూపమే ఈ విశ్వము. కనుక గాయత్రి సర్వత్రానిండినటువంటి మాతృమూర్తియే. ఇట్టి మాతృస్వరూపిణి అయిన ప్రతిమానవుడు కూడనూ మాతృస్వరూపియే. కాని లౌకికమైన, భౌతికమైన రూపనామములను విచారం చేసుకొంటూ, ఇది మగ! ఇది ఆడ! అనేటటువంటి బేధములను పాటించుకుంటున్నారు. స్త్రీ, పురుషులనేటటువంటి బేధములు ఏమాత్రం లేవు. ప్రతి వ్యక్తి యందు మాతృతత్వమనే చైతన్యము గోచరిస్తూనే ఉన్నది. కనుక చైతన్యములేని జీవులు జగత్తులో కానరారు. ఆ చైతన్యమే గాయత్రీ స్వరూపము. అదియే సర్వశక్తిమయము. అట్టి యదార్థతత్వాన్ని మానవుడు ఈనాడు మిథ్యామైన, లౌకికమైన, భౌతికమైన, ప్రాకృతమైనటువంటి రూపనామములను ఆధారం చేసుకొని, అనేక దుఃఖములకు గురి అవుతున్నాడు.

వేదమాత నాలుగు విధములైన మాతృమూర్తులను సృష్టిస్తూ వచ్చింది. **1. సత్యవతి 2. అన్యవతి 3.అంగవతి 4. నిదానవతి** అను నాలుగు మాతృమూర్తులను సృష్టించి, ఈ నాలుగు మార్గములలో దివ్యత్వాన్ని దర్శించమని ప్రబోధిస్తూవచ్చింది వేదమాత.

**1. సత్యవతి :** అనే రూపమునకు అర్థమేమిటి? సర్వత్రావుండినటువంటి యొక్క సత్యస్వరూపమే ఈ మాతృమూర్తి. పాలలోని ప్రతి బిందువునందునూ వెన్న ఉన్నది. వెన్నలేని పాలు ఈ జగత్తులో ఉండవు. ఈ జగత్తే ఒక భాండము. సర్వత్రా ఉండినటువంటి చైతన్యమే పాలు. క్షీరమునందు సర్వత్రా వ్యాపించినటువంటిదే దివ్యత్వమనేటటువంటి వెన్న. ప్రాచీన కాలము నుండి

## భగవాన్ సాయి దివ్యబోధ

మహర్షులు ఇతిహాసపురాణము లను మధించి, అందించినటువంటి సుధానిధియే ఈ దైవత్వము. కనుక మనం దేనిని వ్యర్థముగా భావించ కూడదు. ప్రతి పదార్థమూ దైవ స్వరూపమే. ప్రతివ్యక్తీ దైవస్వరూపుడే.

**2. అన్యవతి :-** పంచభూతముల యొక్క స్వరూపమే అన్యవతి. ప్రతి వ్యక్తి యందునూ ఈ పంచభూతములు ఉంటున్నాయి. ప్రతి ప్రాణి నందునూ ఈ పంచభూత స్వరూపమైనటువంటి దివ్యత్వము ఆవిర్భవించి ఉంటున్నది. కనుక నీవు వేరు, నేను వేరు అనేటటువంటి బేధమునకు ఏ మాత్రం అవకాశం యివ్వకూడదు. ఇతను కూటి పేద, అతను కోటీశ్వరుడు. ఈ బేధమునకు బాహ్యరూపమేగాని కారణము, ఇందులో దివ్యత్వమనేటటువంటిది సహస్వరూపమే కనుక ప్రతి ప్రాణియందునూ పంచభూతములు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు వ్యాపించి ఉంటున్నాయి. కనుకనే దీనిని 'అన్యవతి' అన్నారు. 'అన్యవతి' అనగా ఒకొక్కటి ఒక్కొక్క భూతస్వరూపాన్ని ధరించి ఉండటం. కనుక పంచ భూతములచేత కూడినటువంటిదే 'అన్యవతి'.

**3. అంగవతి :-** ఒక్కొక్క రూపమునకు ఒక్కొక్క చిహ్నమును ఆధారము చేసుకొని రూపొందుతూ వచ్చింది. రాముడు కోదండపాణి, ఈశ్వరుడు పినాకపాణి,

స్త్రీలకు మొట్టమొదట గౌరవం ఇవ్వాలి. ఎక్కడ స్త్రీలు గౌరవించబడుతారో అక్కడ భగవంతుడుంటాడు. కౌసల్య కనటం చేతనే రాముడు దేవుడుగా మారిపోయాడు. సీత సాకటం చేతనే లవకుశలు అంత గొప్ప వీరులుగా తయారైనారు. జిజియాబాయి పెంపకం చేతనే శివాజీ అంత గొప్పవాడయినాడు. తల్లి బోధనలకు అత్యంత విలువ ఉన్నది. ఎందువలననంటే పిల్లలు తల్లులకు దగ్గరగా ఉంటారు. మంచి తల్లులకు మంచి బిడ్డలు రూపొందుతారు.

మనం మాతృమూర్తికి ఎంత గౌరవం యిస్తామో, మాతృదేశమునకు కూడా అంత గౌరవము యివ్వాలి. రాముడు కూడా 'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి' అన్నాడు. అయితే ఈనాడు 'జాతీయత' అంటే ఏమిటో తెలియటం లేదు. మనం ఏవిధంగా తల్లిదండ్రులను గౌరవిస్తామో, మనం జన్మించిన దేశమును, ఆ దేశ సంస్కృతిని ఆ విధంగానే గౌరవించటం నేర్చుకోవాలి. ఈనాడు అది కనిపించటం లేదు. ఎక్కడ ఉన్నా ఏ దేశమైనా ఫరవాలేదు. జీవితం గడిస్తే చాలనుకుంటున్నారు. ఈ జీవితం ఒక జీవితమా! పశుపక్ష్యాదులు కూడా జీవిస్తున్నాయి.

ఎలాంటి పరిస్థితులలోనైనా దైవాన్ని మాత్రం ప్రార్థించాలి. అదియే భారతీయ సంస్కృతి. దైవాన్ని ఆధారం చేసుకొని దేహాన్ని మనం పోషించుకోవాలి. పుట్టటానికి ఎవరు కారణం? మరణించడానికి ఎవరు కారణం? ఇవన్నీ దైవహస్తం లోపల ఉంటున్నాయి. కనుక మనం దైవమును ఆశ్రయించాలి, దైవాన్ని ప్రేమించాలి, దైవకార్యక్రమములలో మనం ప్రవేశించాలి, దైవం నా హృదయమునందే ఉన్నాడని పూర్తిగా విశ్వసించాలి. భగవంతుడు ఏ క్షేత్రవాసోకాదు. భగవంతుడు హృదయ వాసి. అంత సమీపంలో ఉన్న దైవాన్ని ఎలా మరచిపోతున్నావు? అందరికంటే గొప్ప స్నేహితుడు దేవుడే. మిగతా స్నేహితులు మన జేబులో డబ్బును చూస్తారు, మన హోదాను చూస్తారు. అవి బాగుంటే... హలో! హలో! అంటూ చుట్టూ తిరుగుతారు. కాని భగవంతుడు వీటిని ఏమీ చూడడు. నీ హృదయాన్ని చూస్తాడు. కమాన్! కమాన్! అంటాడు. ఎలాంటి పరిస్థితులలోను నిన్ను వదలనటువంటి వాడు ఒక్క భగవంతుడు మాత్రమే.

ప్రపంచమే ఒక పెద్ద గ్రంథము. Nature is the Best Teacher. హృదయమే మనకు గురువు. దేవుడే మనకు స్నేహితుడు. ఈ మూడింటిని మనం ఆధారం చేసుకుంటే, మన జీవితం ఎంతగానో సార్థకమవుతుంది. కనుక భగవంతుణ్ణి స్నేహం చేసుకోండి. ఈ స్నేహమునకు మూలకారణము ధనము కాదు. ఇంకే విధమైన ఆధారము కాదు. ఈ స్నేహమునకు ప్రేమ ఒక్కటే మూలాధారము. ఈ ప్రేమ చేతనే నిజమైన స్నేహితం ఏర్పడుతుంది. ద్వేషము చేత ఏ మాత్రం ఆనందమును పొందలేవు. ఒక్క ప్రేమ చేతనే ఆనందం. ఆనందం ప్రేమలోనే ఉంటున్నదిగాని మరొకదానిలో లేదు. మొక్కను మట్టిలో పెట్టినప్పుడే వృక్షముగా మారిపోతుంది గాని, ఒక గిన్నెలో పెట్టి నీరుపోస్తే అది పెరగదు. అదేవిధంగానే ధార్మికము అనేది మన హృదయమునందే అభివృద్ధి అవుతుంది. ఆధ్యాత్మిక, నైతికములు మన హృదయము నుండే ఆవిర్భవిస్తుంటాయి. ఆ ప్రేమ చేతనే మనం దైవాన్ని స్మరించాలి. ఈ ప్రేమ చేతనే దైవము యొక్క స్నేహమును పొందాలి. కనుక ప్రతి మానవుని యందు సహజంగా ఉండిన ప్రేమను మనం సహజంగా అభివృద్ధి పరచుకోవాలి. కనుక ఆ ప్రేమనే మనకు రమింప జేసేటటువంటివాడే రాముడు. "రమేతీతి రామః" అన్నారు. రమించేటటువంటిది హృదయమే.

(ది. 19-11-97 ప్రశాంతి నిలయంలో మహిళా సభలో భగవాన్ సాయి చేసిన ప్రసంగము నుండి) ●

## పదాలపందిరి సమాధానాలు - 7

అడ్డం : 1. దేవత, 3. ఘటన, 5. లలాటం, 7. ముది, 9. వేడు, 10. నశ్యం, 11. వడి, 12. గేము, 14. మితి, 16. కేతువు, 18. మురళి, 19. నవీన.

నిలువు : 1. దేశము, 2. తల, 3. ఘటం, 4. నరుడు, 6. లాభం, 8. దినము, 9. వేడిమి, 12. గేయము, 13. లోతు, 15. తిక్కన, 16. కేళి, 17. నవ్వు

# మేటి తాత్వికుడు
# జిడ్డు కృష్ణమూర్తి (జి.కె)

డా॥ రాపర్ల జనార్దనరావు

అది ఒక మహత్తర సన్నివేశం. విచిత్రం కూడా. మద్రాసులోని అడయార్ బీచ్ వద్ద ఇద్దరు పిల్లలు సముద్రపు ఇసుకమీద కేరింతలు కొడుతున్నారు. అడయార్‌లోనే సంస్థాపించబడిన థియాసాఫికల్ సొసైటీ (దివ్యజ్ఞాన సమాజము) తత్త్వవేత్తలు అనీబిసెంటు, దివ్యదృష్టి కల్గిన బిషప్ లెడ్ బీటర్ ఆ సమయంలోనే సముద్రతీరపు వ్యాహ్యాళికై వచ్చారు. బిషప్ లెడ్‌బీటరు మహత్తర దృష్టి ఆ ఇద్దరి పిల్లల్లో ఒకతనిమీద పడింది. ఆ 12ఏళ్ళ అబ్బాయిని చూచి లెడ్ బీటర్ నివ్వెరపోయాడు. నిశ్చలుడైనాడు. ఆతని అతీతశక్తి గల దృష్టిలో ఆ పిల్లవాడు, లెడ్‌బీటర్‌కు అంతా తేజోరూపంగా, నిస్వార్ధ సాత్విక రూపంగా గోచరించాడు. ప్రక్కనగల అనీబిసెంటును పిల్చి "ఈ బాలుడు మహిమాన్వితుడు. భగవదావతారము. మైత్రేయి, బోధిసత్త్వుడు, క్రీస్తుల పునర్జన్మ" అని తెల్పాడు. ఆ బాలుని వర్చస్సును బట్టి ముఖవైఖరిని బట్టి, తనకుగల అలౌకిక అతీతశక్తులను బట్టి అలా తెల్పగల్గినాడు. అనీబిసెంటు ఆ బాలుని పిల్చి, ఆతని తల్లితండ్రుల వివరాలు తెల్సుకుంది. తీరా చూస్తే ఆ బాలురు, సోదరులు. దివ్యజ్ఞాన సమాజంలో పనిచేసే జిడ్డు నారాయణయ్య పిల్లలు. తండ్రిని కలుసుకున్నది అనీబిసెంటు. "ఆ బాలుని నాకివ్వు. విద్యాబుద్ధులు విదేశాలలో నేర్పించి పెద్దవానిని చేస్తాను. ఈతడు సామాన్యుడుకాదని బిషప్ లెడ్ బీటరు చెప్పాడు" అన్నది. ఈ బాలుడు తమ్ముడు లేనిదే ఎక్కడా ఉండడు. ఆ విషయం తల్లితండ్రులు చెప్పగా, సరే, ఇద్దర్నీ చదివిస్తానని అంగీకరింపచేసి ఆ బిడ్డల్ని ఇద్దరిని ఇంగ్లండు తమ ఖర్చుల మీద పంపి విద్యాబుద్ధులు నేర్పించింది. ఆ బాలురలో పెద్దవాడే మన జిడ్డు కృష్ణమూర్తి, రెండవవాడు నిత్య.

మదనపల్లిలో 1895 సంవత్సరం, సద్బ్రాహ్మణ తెలుగు కుటుంబంలో జన్మించాడు జిడ్డు కృష్ణమూర్తి. ఈతడే ఖండఖండాంతరాలలో అనర్గళమైన ఆంగ్లభాషలో ఆధ్యాత్మిక విషయములపై ఆశువుగా ప్రసంగాలు చేస్తుంటే విదేశీయులందరూ విస్తుపోయారు. గ్రీకు తాత్వికుడు సోక్రటిస్ మరల జన్మించాడా అనుకున్నారు. జి.కె. ప్రసంగిస్తుంటే సభలో సీట్లు ఖాళీ ఉండవు. శ్రోతలు కిక్కిరుమనరు. కడకు కరతాళధ్వనులు మార్మ్రోగిపోతాయి. ఆతడే మన భారతకీర్తి, జిడ్డు కృష్ణమూర్తి. ఆంధ్రదేశంలో అవతరించిన ఆధ్యాత్మిక తత్త్వవేత్త. 90 ఏండ్లు నిండు జీవనం, బ్రహ్మచారిగా జీవించి తుదకు అమెరికాలోని కాలిఫోర్నియాలో ఫిబ్రవరి 17, 1986వ తేదీ దివంగతుడయ్యాడు. అన్ని దేశాలలో ఆతని సంఘాలు నెలకొల్పబడినాయి. ఆతనికి మక్కువైన మొదటి విషయం బాలలవిద్య, ఆతని విధానం వినూత్నం. ప్రతి బాలుడు దైవ సమానుడు. వానిలో నిద్రాణమైన నిజరూపాన్ని వెలువరింప చేయటమే విద్యాబోధనకు ప్రధమ లక్ష్యం. ఆతని వ్యక్తిత్వాన్ని పెంపొందింపచేయాలి అనునది జి.కె. ప్రబోధం.

"ఈ అవతార మూర్తికి (Messiah) మేము విద్య గరపలేము' అని ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీ వారు తిరస్కరించారు. అప్పటికి కృష్ణమూర్తికి (కృష్ణాజీ అని అతని ప్రతిష్ఠ నామం) 13 ఏళ్ళు. 15వ ఏట కృష్ణమూర్తి "At The Feet of the Master" "ప్రభుపాద సన్నిధి వద్ద" అనే గ్రంధం రచించాడు. అది 27 భాషలలో తర్జుమా అయింది. 40సార్లు పునర్ముద్రణ జరిగింది. 16వ ఏట ఒసంగిన తొలి ఆంగ్లోపన్యాసం పాశ్చాత్య దేశాలలో సంచలనాత్మకమైంది. అనీబిసెంటు "Order of the East", దివ్యజ్ఞాన సమాజంలో ఒక శాఖగా ఏర్పరచి

కృష్ణమూర్తిని అధిపతిగా చేసింది. దివ్య జ్ఞాన సమాజ సభ్యులనందరిని కృష్ణమూర్తిని ప్రేమించి, గౌరవించమని తెల్పింది. ఆమె మాటల్లోనే "Only once in thousands of years is such a life lived among mortal Men" "వేలాది ఏండ్లకొకసారి మాత్రమే మానవుల మధ్యన ఇట్టి వ్యక్తి సంచరించగలడు" అని తెల్పినది. అనీబిసెంటు ఆంగ్లభాషను ఒక ప్రత్యేక శక్తిగ మార్చిన మహిళ అని ఆమె వేనోళ్ళ ప్రశంసింపబడుటకు ఈ ఒక్క వాక్యము చాలు మచ్చుతునక. ఆంగ్లభాషా ప్రియులెల్లరు అనీబిసెంటు ఆంగ్లరచనలు చదివి తీరవలసిందే.

కృష్ణమూర్తి సుందర విగ్రహుడు. ఆతని కన్నులు, కోటేరు పోసిన ముక్కు, వేదాంతికి ఉండవలసిన మృదువైన శిరోజములు శిల్పి చెక్కిన విగ్రహము వలె కన్పించెడివాడు. ఆతని సుందర విగ్రహం గూర్చి ప్రసిద్ధ రచయిత ప్రముఖ విమర్శకుడు నోబెల్ బహుమతి గ్రహీత జార్జి బెర్నార్డు షా ఇలా అన్నాడు. "Krishna Murthy is the most beautiful humanbeing I have ever seen" "నేను చూచిన మానవులందరిలోనూ కృష్ణమూర్తి అందగాడు". అంతటివాడు అంతటి విషయం తెల్పితే ఇంకా ఏం కావాలి? అనీబిసెంటును Mother అని పిలిచేవాడు కృష్ణాజీ. విదేశాలలో ఉన్నా విషయమోహితుడు కాలేదు. మహాత్ముడగుటకు నిత్యమూ మంచి బాటలు వేసికొనేవాడు.

1922 లో కాలిఫోర్నియాలో ఉండగా ఆతనికి అలౌకిక ఆధ్యాత్మికానుభూతికలిగింది. ఆ దివ్యజ్ఞానానందంలో ఆయన పల్కిన పల్కులు ఎంతటి మహిమాన్వితములు! "I have seen the Light. I have touched the compassion which heals all sorrow and suffering; it is not for myself, but for the World". "తేజాన్ని చూచాను. వేదన, బాధలు తొలగించే, ప్రేమార్ద్రతను స్పృశించాను. అది నా కొరకు కాదు. ప్రపంచముకొరకే."

"ఆర్డర్ ఆఫ్ ది ఈస్టు" అధిపతిగ ఆతనికి ఒక డచ్ జమీందారు 5వేల ఎకరాల భూమిని, ఒక దివ్య భవంతిని విరాళముగ ఇచ్చారు. "ఈతడే దైవావతారము, లోకాన్ని రక్షించుటకు పుట్టిన Messaiah దైవరూపము అని ఒక పెద్ద సభ ఏర్పాటు చేసి అనీబిసెంటు కృష్ణమూర్తికి కీర్తి కిరీటము ప్రతిష్టింపబోయింది. అంతటి కీర్తి, ఘనత ధనసంపదలతో కూడిన ప్రతిష్ఠను కృష్ణమూర్తి స్వీకరించినాడా? లేదు. సభ్యులందరూ నిర్ఘాంతులగునట్లు "నేను దేవుడను కాదు. నేనొక సత్యాన్వేషణకుడను మాత్రమే" అని ఆ ఉన్నత స్థానాన్ని నిరాకరించినాడు. సకల సంపదలు, సమస్త భోగములను తృణీకరించి సత్యాన్వేషణకై అడవులకేగిన సిద్ధార్థుడు, బోధిసత్వుడు ఇదేరీతిని సంగ వివర్జితులు కాలేదా? ఆనాటి వరకు అనీబిసెంటు ఛాయల క్రింద మెలగిన కృష్ణమూర్తి, స్వాతంత్రుడై పంజరముల నుండి వెలువడిన పక్షి వలె రెక్కలు కలిగి వినువీధుల సంచరించినటుల, విశాల ప్రపంచము నందెల్లడల అనేక ఆధ్యాత్మికోపన్యాసములొసగి ప్రజలను చైతన్య మూర్తులుగా చేసినాడు.

ఆయన ఉపన్యాసములు విని స్ఫూర్తిచెందిన ప్రసిద్ధ రచయిత, విమర్శకుడు Aldous Huxley "the most impressive thing I have listened to. It was like listening to a discourse of Buddha" "నన్నెంతో ప్రభావితుణ్ణి చేసింది. బుద్ధుని బోధలు విన్నట్లే ఉంది." ప్రసిద్ధ కవి ఖలీల్‌జిబ్రాన్ 'ఈతడు ప్రేమ-ప్రభువు' అని వర్ణించాడు.

కృష్ణమూర్తి పల్కిన పల్కులన్నిటిని జాగ్రత్త చేసి ఆయన వెంట నడిచి ఆయన సూక్తులు పలు గ్రంథములలో ప్రచురింపచేసిన ప్రసిద్ధురాలు శ్రీమతి ప్రపుల్ జయకర్. ఈమె శ్రీమతి ఇందిరాగాంధికి సాంస్కృతిక రంగమున సలహాదారుగా సేవలందించిన ప్రసిద్ధ భారత మహిళ. మే11, 1986 అమెరికాలోని 'ఓజ' అనే కృష్ణమూర్తి కుటీరంలో అచట ఉదయం గం॥ 4-00కు, జె.కె. కన్ను మూసినపుడు ప్రపుల్ జయకర్ అతని చెంతనే ఉంది, కృష్ణమూర్తి కడసారి కోర్కె చొప్పున ఆతని భౌతికకాయము ఎట్టి మంత్ర తంత్రములు లేక నిరాడంబరముగ దహనము చేయబడినది. జె.కె. ఫౌండేషన్ పలు దేశములందు శాఖోప శాఖలుగ వృద్ధి పొందినది, ఇంకొక సంవత్సరమునకు మరణింతురనగా అడయారులో ఉపన్యాసమిచ్చి అనారోగ్య

కారణము వలన అమెరికా వెళ్ళి 90వ ఏట సుదీర్ఘ జీవన యాత్ర సాగించినాడు. చిట్టచివరి దశలో తన జన్మస్థలమైన మదనపల్లి వచ్చి అచ్చట చేసిన ప్రసంగము ఆ విద్యాసంస్థ యుందలి పిల్లలను అనురాగముతో ప్రశ్నించుట, వారొసగిన చక్కని జవాబులకు తానెంతో ఆనంద పరవశుడగుట, దూరదర్శన్‌లో డాక్యుమెంటరీ ప్రసారము జరిగినది. అది చూచి వీడియో రికార్డు చేసికొనెడి భాగ్యము నాకు కల్గినది.

ఇక ఆ మహనీయుని జీవితము నుండి వెల్వడిన సత్యవాణిని విందాము.

"సత్యము అనంతము. దానిని చేరెడి మార్గములు కూడా అనంతములే." "సత్యాన్వేషకులకు వారి వారి ఉపాధిని బట్టి మార్గములు గోచరించుచుండును." "నేను గురువును కాదు. మీకు మీరే గురువులు మీ ఆత్మ స్వరూపమును మీరే ఎరుగవలయును నేను కేవలము మీ నిజరూపమును చూచుటకు వలసిన అద్దము చూపువాడను."

"సత్యము తెలిసికొనవలయునన్న మానవుడు తాను నిర్మించుకొన్న పంజరమును ఛేదించుకొనవలయును. భయవివర్జితుడు కావలయును. క్రొత్త మతములు విధములు స్థాపించెడి యత్నము చేయబూనరాదు."

"మనకు మతములు ప్రాధాన్యము కాదు. మానవ ప్రవర్తనావళి ముఖ్యము". "మానవాళి యందు తరతమ భేదములు కల్పించు ఏ విధానము వలనా సత్యము తెలియదు. దీనివలన సంఘమునందు అనేక బాధలు ఉత్పన్నమగుచున్నవి." "మన మానసిక స్థితి యందు మార్పు కల్గుటయే ముఖ్యము."

"నీ పొరుగు వానితో, నీ మిత్రునితో, ఇతరులతో మాట్లాడునపుడు అనుక్షణము నీవు ప్రవర్తించునపుడు, నిన్ను నీవు అంచనా వేసుకొని నీలో మార్పు తీసుకొని రమ్ము. అప్పుడే నిజమైన సంఘ సంస్కరణ జరుగగలదు. మాటలు కాదు నీ చేతల వలన అనుదిన ప్రవర్తన వలన నీ నిజరూపము వెల్గొందుచుండును."

# ఫ్రెంచి విద్వాంసుడు

అనేక దేశాలనుండి విద్యావేత్తలు, వేరు వేరు భాషాభిమానులు వచ్చారు. వీరంతా యునెస్కో సభలో పాల్గొనుటకు వచ్చియున్నారు. ఫ్రెంచి విద్వాంసుడు ఒకాయన ఆంగ్ల భాషలో ఉపన్యసించుటకు తన ఉపన్యాసమును సిద్ధము చేసుకొని వచ్చాడు.

ఇతని కంటే ముందుగా ఒక ప్రముఖ వ్యక్తి ప్రసంగించవలసి వచ్చింది. ఆ వ్యక్తి ప్రసంగిస్తూ ఉంటే ఆంగ్ల భాషలో అతనికిగల సామర్థ్యమునకు, భావాన్ని ప్రకటించడంలో అతనికిగల నైపుణ్యమునకు అతని వాక్పటిమకు సభ్యులంతా ముగ్ధులయ్యారు. ఉపన్యాసానంతరము సభ అంతా కరతాళ ధ్వనులతో మారు మ్రోగింది.

ఆ వ్యక్తి ఉపన్యాసమును విన్న ఆ ఫ్రెంచి విద్వాంసుడు తరువాత తను ఆంగ్లములో ప్రసంగిస్తే అంతగా రాణించదని తెలుసుకున్నాడు. ఆంగ్లములో ప్రసంగించడానికి జంకాడు. ఫ్రెంచి భాషలోనే ప్రసంగించాడు.

ఈ ఫ్రెంచి విద్వాంసుడు భయపడటానికి కారకుడైన ఆ వాక్పటిమా చాతుర్యుడు మన రాధాకృష్ణపండితుడు. మన భారతీయ తత్వశాస్త్రాన్ని విదేశీ పండితులకు అందించాడు. ఐరోపా - అమెరికా విశ్వవిద్యాలయాలలో మన తత్వశాస్త్రమునకు స్థానమును ఏర్పరచిన ప్రథమ వ్యక్తి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్. 1962లో ఈయన భారత రాష్ట్రపతిగా ఎన్నుకోబడ్డారు. ఈ ప్రముఖ తాత్వికుడు భారతీయుడగుట మన అందరకూ ఎంతో గర్వకారణం కదా!

- ఎన్. వి. ఆర్. సత్యనారాయణ మూర్తి

# సంక్రాంతి లక్ష్మి

"పసుపు పచ్చని బంతి చేమంతి విరులు
ఎంతో హాయిని కలిగించుచున్న వేళ
మెలమెల్లగ చల్లని గాలి వీచుచుండ
మంచు తెరలను తొలగించు కొనుచు వచ్చె
ధాన్యలక్ష్మిని తోడుగాగొని సంక్రాంతి లక్ష్మి"

పండుగలలో కెల్ల పెద్దపండుగ. ముచ్చటైన మూడు రోజుల పండుగ సంక్రాంతి పండుగ. సంవత్సరమునకు రెండు ఆయనములు. ఒకటి దక్షిణాయనము, రెండు ఉత్తరాయణము. ధనూరాశి నుండి మకరరాశిలోకి ప్రవేశించే కాలమే ఉత్తరాయణ పుణ్యకాలం. మకర సంక్రమణము, మకర సంక్రాంతి అని పిలువబడుతున్నది. ఉత్తరాయణము చాలా పుణ్యమయిన కాలము. పితృ దేవతలకు ప్రీతిని కలిగించే రోజు. ఈ రోజున పితృదేవతల ప్రీతికై దానధర్మములు విరివిగా చేయాలని మన పురాణములు చెబుతున్నాయి.

"కాలే పాత్రే తథాదేశే
ధనం న్యాయాగతంతథా
యద్దత్తం బ్రాహ్మణ శ్రేష్ఠా
స్తదనన్తం ప్రకీర్తి తమ్॥"

అనగా దేశకాలపాత్రల నెరిగి న్యాయాను గతముగ చేసిన దానము కొంచమయినను అది అనంత మయిన ఫలములనిస్తుందని మన శాస్త్రములు చెబుతున్నాయి. అందుకే పాత్ర ఎరిగి దానం చెయ్యమన్నారు. మంచి చెడులను చూడకుండా చేసిన దానములన్నీ అపాత్రదానములే. మానవులు తెలిసీ తెలియక చేసిన దోషములను పోగొట్టుకొనుటకై శాస్త్రోక్తముగా దాన ధర్మములను చేసే పుణ్య ప్రదమయిన రోజే ఈ ఉత్తరాయణ పుణ్యకాలము. ఏ శుభకార్యములు చేయుటకైనా ఉత్తరాయణము మంచి కాలము. సంక్రాంతి పండుగకు ముందు రోజు భోగి పండుగ. అందరూ ఉదయాన్నే లేచి తలంటు స్నానం చేసి క్రొత్తబట్టలను ధరిస్తారు. సాయంత్రం చిన్నపిల్లలకు భోగిపండ్లు పోస్తారు. రేగుపండ్లు, కొత్తబియ్యం, బంతిపూలు చిల్లర కలిపి పదిమంది ముత్తైదువులను పిలిచి పిల్లలకుపోసి హారతి ఇస్తారు.

## కొమరగిరి జయప్రద

మరికొంతమంది చాలా అందముగా బొమ్మల కొలువులు పెడతారు. ఈ రోజుల్లో ఎటుచూసినా పచ్చని పొలాలతో సస్యలక్ష్మి కళకళలాడుతుంటుంది. మంచి ముత్యాలవంటి మంచులో తడిసిన బంతి చేమంతి గులాబీ పూబాలలు స్వాగతం చెబుతుంటాయి. చలికి ముడుచుకొని దుప్పటిలో తల దూర్చిన వారందరినీ మేలుకొలుపుతూ హరిలో రంగ హరీ అని పాడుతూ నగర సంకీర్తన చేస్తూ వస్తారు హరిదాసులు. వారు సిరిదాసులు కారు. ఎందుకంటే సంవత్సరానికి ఒక నెల మాత్రమే వారు వచ్చేది. అయ్యగారికి దణ్ణం పెట్టు దూడూడూడూ బసవన్నా అంటూ గంగిరెద్దులవారు, భారతభాగవతాలను వావి వరసలతో కలిపి చమత్కారంగా చెప్పే బుడబుక్కల వారూ మనకు ప్రొద్దుటే దర్శనమిస్తారు. ధనుర్మాసం మొదలు సంక్రాంతి వరకు గల నెలరోజులూ వీధులన్నీ కూడా ఎంతో కళకళలాడుతూ ఉంటాయి. ప్రతిఇంటి ముందు పోటాపోటీలుగా వేసే రంగవల్లులు. వాటిపైని ఆవుపేడతో చేసిన గొబ్బెమ్మలు, బంతిపూలు ముద్ద మందారాలతో అందంగా అలంకరించుకొని మనకు సాక్షాత్కరిస్తాయి. తెల్లవారు ఝామున వేసే భోగి మంటలు శరీరానికి చలిని పోగొడతాయి. వైష్ణవాలయాల్లో నెలరోజులూ జరిగే పూజలు పెద్దవారికి, ప్రసాదాలు

చిన్నవారికి ఉత్సాహాన్ని కలిగిస్తాయి ఈ నెలంతా.

మూడవరోజు కనుము. పశువులను అందంగా అలంకరించి వాటిని పూజించి, ఆడించి, క్రీడించి, పశువులలో కూడా పశుపతిని చూచే పవిత్రమయిన రోజు. జీవుడైనా దేవుడైనా ఒక్కటే అన్న సత్యాన్ని గుర్తించిన మనవారు "సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అన్నారు. అలాగే 'సర్వదేవ తిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' అని కూడా అన్నారు. కాబట్టి ఏ జీవుణ్ణి పూజించినా అది భగవంతునికే చెందుతుంది. అలాగే ఏ జీవిని తిరస్కరించినా అది భగవంతునికే చెందుతుంది. అన్ని జీవులలోను పరమాత్మను దర్శించే పరమోత్కృష్టమైన ధర్మం మనది. అంతే కాక ఈ పండుగ పల్లెలలోని రైతన్నలకు కూడా ఆనందమయమైన పండుగ. పంటలన్నీ చేతికి వస్తాయి. ఇంటి నిండా ధాన్యపు గాదెలలో ధాన్యలక్ష్మి, దాని వల్ల ధనలక్ష్మి, ఇంటాబయటా కూడా కళకళలాడుతూ వస్తుంది పౌష్యలక్ష్మి. పండుగకు అత్తగారింటికి వచ్చిన అల్లుళ్ళ హడావుడి, బావమరదుల హాస్యోక్తులు, కొంటె మరదళ్ళ సరససల్లాపాలు, వంట ఇంట్లో అత్తగారు చేసే పిండివంటల ఘుమఘుమలు అంతా సందడే. అంతా కోలాహలమే. పుణ్యము పురుషార్థము లతో కూడిన ముచ్చటయిన పండుగ సంక్రాంతి పండుగ. ✳



# దేవీ వినుతివీణ

✪ శ్రీవాణి వనితలుఁదమి
సేవించెడి నీ మహా విశేష చరణరా
జవశ్రీల కెఱఁగెద స
ద్భావ ఝరిందడుపు కలముదారత దేవీ!

✪ శంకరురాజ్ఞీ! శత్రుభ
యంకరరూపిణీ! నిరతదయారసభరప్రా
త్పంకేరుహసంశోభిని!
ఓంకారిణీ! వందనమ్ము లొందుము దేవీ!

✪ బహుగర్వలోక భయ కరు
మహిషాసురుఁ బీచమడచి, మనుపుచు సురలన్
"మహిషాసురమర్దని" యని
మహితచరితఁగంటివి గదా! మాతా! దేవీ!

✪ నీదగు కారుణ్యరస
స్వాదు మధురమెంత రుచులొసంగునొ! గౌరీ!
యాదేవమౌనులు భవ
త్పాదాబ్జములొంద వేచి వదలరు దేవీ!

✪ పసుపుంగుంకుమ గాజులు
పసిండి కమ్మలును తాళి, భార్యాంకములై
వసుధను "ఐదువ" రాండ్రన
వసలాది సుమంగళి యవుదమ్మా దేవీ!

\- పృథివి

# విశ్వరూప సందర్శన యోగం

"సుదుర్దర్శ మిదం రూపంద్సృష్టివా ససియన్మమ
దేవా అప్యస్య రూపస్స నిత్యం దర్శన కాంక్షిన :"

నీవు చూసిన ఈ విశ్వరూపము చూడ శక్యము కానిది. దేవతలు సైతం ఈ రూపమును దర్శించగోరు చుందురు.

విశ్వరూప దర్శన భాగ్యము అచ్యుతుడు అర్జునునికి అనుగ్రహించెను. భగవానుని దర్శించుటకు పరిమిత నేత్రములతో చూడబడే అవకాశమే లేదు. అనంతుని గాంచే నేత్రము అనంతమయ్యే ఉండాలి. అనంతమైన నేత్రమే అద్భుత నేత్రము. అదియే జ్ఞాన నేత్రము. అదియే శ్రీకృష్ణుడు అర్జునునికి ప్రసాదించి తద్వారా తన విశ్వరూపము దర్శింపచేసెను. కాలాన్ని అధిగమించిన కమనీయ స్థితి, దేశాన్ని దాటిన దైవస్థితి, విశ్వములోని విశ్వనాధుని విశేష స్వరూపము దివ్య స్వరూప సందర్శనము. విశ్వరూప సందర్శనము అనునది ఒక అద్భుత మహోన్నత ఆధ్యాత్మికానుభూతి. సంపూర్ణమగు భగవదవతారము శ్రీసాయిదత్త జయంతి రోజున అమూర్త్యాత్మకము దత్తమూర్తిగా జోజుకరుకు దర్శనమిచ్చి అనుగ్రహించెను. తిరిగి రామ, కృష్ణ, శివ మారుత్యాది రూపములో 'నానా'కు తన దివ్యస్వరూప సందర్శన మిచ్చారు. ఆ యోగాన్ని ఎల్లవేళలా పునశ్చరణ చేసుకోవాలి. పదేపదే బాబాచేత కబురందుకొన్నా విద్యావంతుడనని, ఉన్నతోద్యోగస్తుడననే అహంకారముతో నానా మనస్సు బాబావైపు మరలి రాలేదు. కాని పూర్వజన్మ సుకృతము భగవదనుగ్రహము పూర్ణముగా ఉండుట చేతనే నానాకు శ్రీసాయి సందర్శన భాగ్యము లభించింది.

'స్వామీ! నన్నేల పిలిపించితిరి' - అని నానా వేసిన ప్రశ్నకు బాబా ఎంతో ప్రశాంతంగా సమాధానం చెప్పారు.

"ప్రపంచమున ఎందరు లేరు! ప్రత్యేకముగా నీకై కబురంపితినే! నీవెరుగక పోవచ్చును. కాని గత మూడు జన్మలనుండి మనకిరువురకును సంబంధమున్నది. నిన్ను చూడక నేనెట్లుండగలను! నేను కోరిన నీవు రాక ఎట్లు తప్పించుకొనగలవు? సందేహము లేక చూడుము" అని బాబా భక్త రక్షణ పరతంత్రమగు పవిత్ర హస్తములతో నానా నేత్రములు తాకెను.

గత మూడు జన్మల గాధ కన్నుల ముందుండెను. అయోమయావస్థతో నానాకు అగమ్య గోచరముగా ఉన్నది. ఇంకనూ సంశయము వలదు అంటూ

## వాడవల్లి విజయలక్ష్మి

బాబా తన వామ హస్తము ఎత్తి చూపించెను.

జన్మ జన్మాంతరములు తపమాచరించిననూ లభ్యముగాని దివ్యమూర్తుల దర్శనము ఏకకాలమున నానాకు లభించినది. దివ్య తేజోమూర్తియగు శ్రీ సాయి. శ్రీ శివ, శ్రీమారుతి రూపములతో ప్రసన్నుడై దర్శన మిచ్చెను. తన కన్నులను తానే నమ్మలేని స్థితి యందు పులకరింతలతో సాయి నామమును గానం చేయ ప్రారంభించెను.

శ్రీ సాయి సాదరముగా నానాను కౌగిలించుకొని అమర సుఖాన్ని అందించారు. అహంభావం అంతరించిన నానా క్రొత్త వ్యక్తిగా అవతరించెను.

"ఆహా!! ఎంతటి అద్భుతమైన అనుభూతి, సాయి నామస్మరణ ఎన్ని జన్మల పుణ్యఫలము. నానాకు శ్రీ సాయి అందించిన అపూర్వానుభూతి నామజపము, సంకీర్తనలతో నేడు మనలో కూడా అనుభవించవచ్చు.

సత్యసాయి తన అమృత దృష్టితో 'బంగారూ', అంటూ జనవాహినిని తన వైపుకు మరలించుకుంటూ పరిపూర్ణమైన భక్తి భావము, ఆత్మ సమర్పణ చేసుకున్న ఎందరో భక్తులకు విశేషమైన తన విశ్వరూప సందర్శన భాగ్యం కలుగ చేస్తూనే ఉన్నారు. మనస్సులో నిర్మలత్వం సహజమైన ప్రేమ భావంతో సత్యసాయి రూపంలో నాటి నానా అనుభవాల్ని మనం పొందగలగడం నిజంగా అపురూపమే.

'మత్తః పరతరం నాన్యత్కించి దస్తిదనుంజయ!' అర్జునా! నాకంటే వేరుగా మరియొకటి విశ్వమందుఏదియూ లేదు! అని చెప్పినట్లు తన అభయ హస్తంతో శ్రీ సాయి అంతటా తానే అయివున్నాడు. ★

నవదుర్గలు

# బ్రహ్మచారిణి-2

శ్లో॥ దధానా కర పద్మాభ్యామక్షమాలా కమండలూ,
దేవీ ప్రసీదతు మయి బ్రహ్మచారిణ్యానుత్తమా.

దుర్గాదేవి యొక్క నవశక్తులలో ద్వితీయ స్వరూపం బ్రహ్మచారిణిది. ఇక్కడ బ్రహ్మ శబ్దార్థం తపస్సుగా వస్తుంది. బ్రహ్మచారిణి అంటే తపశ్చారిణి - తపస్సును ఆచరించునది వేదస్తత్త్వం తపో బ్రహ్మ - వేదం తత్త్వం తపస్సు "బ్రహ్మ" శబ్దార్థాలే. బ్రహ్మచారిణీ స్వరూపం పూర్ణ జ్యోతిర్మయమై అత్యంత భవ్యమైనది. ఈమె దక్షిణ హస్తంలో జపమాల, వామహస్తంలో కమండలం ఉంటుంది.

తన పూర్వజన్మలో ఈమె హిమవంతుని పుత్రిరూపంలో ప్రభవించిన వేళలో నారద దేవర్షి ఉపదేశానుసారం శంకర భగవానుని భర్తగా పొంద అత్యంత కఠిన తపస్సు చేసింది. ఈ దుష్కర తపస్సు కారణంగానే ఈమెను తపశ్చారిణి అంటే 'బ్రహ్మచారిణీ' నామంతో జనులు వ్యవహరించేవారు. వేయి సంవత్సరాల కాలం ఈమె కేవలం ఫలమూలాలు మాత్రం గ్రహించి గడపి వేసింది. శతవత్సర కాలపర్యంతం కేవలం శాకంపై జీవించింది. కొంత కాలం కఠినోపవాసం చేసి ఆకాశం క్రింద ఎండ వానలను లెక్కచేయక భయంకర కష్టాలను సహించింది. ఆ కఠిన తపస్సు తరువాత మూడు వేల సంవత్సరాలు రాలిన ఆకులను మాత్రం భక్షించి అహర్నిశలూ శంకర భగవదారాధన చేసింది. ఆ తరువాత ఆమె ఎండుటాకులను భక్షించడం కూడమానివేసింది. ఎన్నో వేల సంవత్సరాలు జలరహితంగా, నిరాహారంగా తపస్సు చేసింది. పర్ణాలను కూడ విడనాడడం వల్ల 'అపర్ణ' నామంతో ఆమె ఖ్యాతిగాంచింది.

వేల సంవత్సరాల కఠిన తపస్సు కారణంగా బ్రహ్మచారిణీ దేవి శరీరం క్షీణించిపోయింది. తీవ్రతరంగా ఆమె కాయం కృశించింది. అట్టి ఆమె దశను తిలకించిన ఆమె తల్లి మీనా దేవి తీవ్రంగా వేదనపడసాగింది. ఆమె తన పుత్రిని ఆ తపస్సు నుండి విరమింపచెయ్యాలని 'ఉమా' అరే వద్దు, ఓ వద్దు అని పిలచింది. నాటి నుండి బ్రహ్మచారిణీ దేవి యొక్క పూర్వజన్మనామంగా 'ఉమా' ఏర్పడింది.

ఆమె తపస్సుకు జనత్రయంలో హాహాకారాలు చెలరేగాయి. దేవతలు, ఋషులు, సిద్ధులు, మునులు



అందరికందరూ - బ్రహ్మచారిణీ దేవి యొక్క ఆ తపశ్చర్యను అభూతపూర్వకంగా పుణ్యకృత్యంగా వర్ణిస్తూ ప్రశంసించారు. చిట్టచివరకు బ్రహ్మదేవుడు ఆకాశవాణి ద్వారా ఆమెను సంబోధిస్తూ ప్రసన్న స్వరంలో - ఓ దేవీ! ఇంత వరకూ ఎవరూ ఇట్టి కఠోర తపస్సు చేయలేదు. ఇట్టి తపస్సు నీకు మాత్రమే తగినది. నీ ఈ లౌకిక కృత్యాన్ని సర్వులూ దశదిశలూ కొనియాడుతున్నారు. నీ కోరిక పరిపూర్ణమగును గాక! చంద్రమౌళీశ్వరుడు పతి రూపంలో నీకు లభించును గాక! ఇక నువ్వు తపస్సు మాని స్వగృహానికి వెళ్ళు. నీ తండ్రి నిన్ను పిలవ శీఘ్రంగా వస్తున్నాడు."

దుర్గామాత యొక్క ఈ ద్వితీయ స్వరూపం భక్తులకూ, సిద్ధులకూ అనంత ఫలాలను ప్రసాదించునట్టిది. ఈమె ఉపాసనవల్ల మానవులలో తపస్త్యాగ వైరాగ్య సదాచార సంయమాలు వర్ధిల్లుతాయి. జీవితంలోని కఠిన సంఘర్షణ వేళల్లో కూడ సాధకుని మనస్సు విచలితం కాదు. బ్రహ్మచారిణీ దేవి కృపవల్ల సాధకునకు సర్వే సర్వత్రా సిద్ధి, విజయాలు లభిస్తాయి. దుర్గా పూజలో రెండవనాడు ఈమె ఉపాసనయే చేయబడుతుంది. ఆ రోజున సాధకుని మనస్సు 'స్వాధిష్ఠాన చక్రంలో' ఉంటుంది. ఆ చక్రంలో స్థిరంగా ఉండునట్టి మనస్సుకల యోగి ఆ తల్లి భక్తిని పొంది ఆమె కృపకు విశేష పాత్రుడవుతాడు.

॥ బ్రహ్మచారిణీ దేవికి జై ॥

మనోభిరామం - 24

# కోరికలు

కోరికలన్నవి బహు చెడ్డవి. మానవుడన్న తర్వాత ఏదో ఒక కోరిక ఉండకుండా ఉండదు. ఏ కోరికాలేని మనిషి ఉన్నాడనడం హాస్యాస్పదం, అతిశయోక్తి.

కాషాయాంబరాలు ధరించి, కఠోర నియమ నిష్టలతో ముక్కు మూసికొని కారడవులలో తపస్సు చేసే ముని పుంగవులకు కూడా కోరిక ఉంది! సర్వసంగ పరిత్యాగులము, మాకే కోరికాలేదని కొందరు చెప్తుండడం కద్దు! కాని అలాంటి వారికీ జన్మరాహిత్యమైన మోక్ష ప్రాప్తికలగాలన్నదే ప్రధానమైన కోరిక. అందుచేత కోరిక అన్నది తప్పని సరి! కోరికన్నది కలుగకుండా ఉండాలేకాని కలిగితే కష్టమే! కలిగిన కోరిక తీరగానే మరొక కోరిక వస్తుంది! అనంతంగా కలిగే కోరికల్ని తీర్చుకోవడంలోనే మనిషి జీవితం వృధా అయ్యే ప్రమాదం ఉంది!

కోరికలను రెండు రకాలుగా చెప్పవచ్చును. స్వార్ధపూరిత కోరికలు! స్వార్ధ రహిత కోరికలు! తనకోసం, తనవారి కోసం, తన లాభం కోసం తాపత్రయ పడే కోరిక స్వార్ధపూరితం! జగతి కోసం, జనుల కోసం జంజాటపడేది స్వార్ధరహితం!

శ్రీరామపట్టాభిషేకానికి నిర్ణయం జరిగిపోయింది. అయోధ్యావాసులందరు ఆనందోత్సాహాలతో పొంగిపోతున్నారు. అసూయా గ్రస్తురాలు, మలిన మనస్కురాలు అయిన మంథర తప్ప! తన వాక్చాతుర్యంతో, కల్లాకపటమెరుగని కైక మనసు మార్చివేస్తుంది. అదను చూసి, అలనాడెప్పుడో పతిదేవుడిచ్చిన వరాలను గుర్తుచేస్తుంది కైకకు! అంతే! స్వార్ధపూరితమైన రెండు కోరికలను బహిర్గతపరుస్తుంది కైక! భరతుని పట్టాభిషేకము - శ్రీరాముని వనవాసము!

యాగ భంగము చేస్తున్న రాక్షస సంహారము కొరకు విశ్వామిత్రుడు దశరధునాశ్రయిస్తాడు! తత్కార్యార్థం, రాముని తనతో పంపమని విశ్వామిత్రుడు కోరతాడు! ముక్కుపచ్చలారని పసివాడిని వదులుకోవడానికి దశరధుని మనసొప్పదు! వలసినంత సైన్యాన్ని, ధనాన్ని తీసికొని, తానొచ్చి యాగరక్షణ చేస్తానంటాడు! తన కోరిక తన స్వార్ధం కోసం కాదని, జగత్ కళ్యాణం కొరకేనని, రాముని వలనే ఆ కార్యం సాధ్యమవుతుందని నచ్చచెప్తాడు! ఆ తరువాత కథ మనందరకు తెలిసినదే! రామాయణ మహాకావ్యంలో యిలాంటి ఉదంతాలెన్నో ఉన్నాయి. కైకేయి కోరిక ఎందర్నో కష్టాలపాల్జేస్తే, విశ్వామిత్రుని కోరిక అందరికీ సుఖశాంతులను కలిగించింది!

## సోమంచి రామం

"స్వామీ! మీ వద్ద గురూపదేశం పొందాలన్నదొక్కటే నా కోరిక" అంటూ ఓ శిష్యుడు గురువుగార్ని ఆశ్రయిస్తాడు ప్రతిరోజూ! ఎంత కాలమయినా ఆ గురువు పెదవి విప్పి పలుకలేదు! అలాగేనన్నట్లు దృష్టి ప్రసరిస్తాడు! ఆఖరికి ఓ రోజున శిష్యుడితో సముద్ర తీరం చేర్తాడు! "స్వామీ! నా ఉపదేశం సంగతి మరిచిపోయారా?" అంటూ అడుగుతాడు శిష్యుడు.

"లేదు నాయనా!....... అందుకే వచ్చాను..... అలా చూడు! ఆ సముద్రంలో అలలు సద్దుమణిగాక ఉపదేశం చేద్దామని చూస్తున్నాను" అన్నాడు.

" అదేమిటి స్వామీ! అది అసాధ్యం కదా!

"అవున్నాయనా! అలల వెంబడి అలలు వస్తున్నట్లే కోరిక వెంబడి కోరిక పుట్టుంది! అందుకని నువ్వడిగిన ఒక్కకోరికా తీరిస్తే యింకో కోరిక పుట్టుంది కదా! అందుకని కోరికలనదుపు చేసికొంటూ నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించుకో! అదే నా ఉపదేశం అంటాడాయన!

ఆంగ్ల సామెత **"లివ్ అండ్ లెట్ లివ్"** అన్నట్లుగా, నీతోపాటు, నీ పొరుగువాడు సుఖజీవనం సాగించేలా నీ కోరికలు ఉన్నంతకాలం నీకేహాని జరుగదు. ■

రసవద్ఘట్టాలు - 33

# దేశ భక్తులను ఉత్తేజపరచిన గీతం

అర్ధరాత్రి దాటింది. బంకించంద్రచటర్జీ తమ "బంగదర్శన్" పత్రికలో ప్రచురణ కోసం వచ్చిన వ్యాసాలను పరిష్కరిస్తూ, ప్రచురణకు సిద్ధపరుస్తున్నారు. ఆ సమయంలోనే మాతృభూమి పట్ల మమకారం పెల్లుబికింది. తమలో భావాలను కాగితంపైకెక్కించారు. అందుకోసం పత్రికలో కొంత స్థలం ఉన్నట్లు గమనించారు. తమలో మెదలిన గీతాన్ని పత్రిక కెక్కించారు. మరోమారు చదివారు. "వందేమాతరం" అంటూ శీర్షిక పెట్టారు.

అంతకు ముందు వంద సంవత్సరాల క్రితం బెంగాల్‌లో తెల్లదొరలపై తిరుగుబాటు చేసిన సన్యాసుల విప్లవ గాథ 'ఆనందమఠం'గా వెలువడింది. ఆనంద మఠం ఉద్యానవనంలో వెలసిన ముద్దమందారం 'వందేమాతరం'.

ఆనందమఠం అచిరకాలంలోనే జనాదరణ పొందింది. గుజరాతి, తమిళం, తెలుగు, కన్నడ భాషలలో అనువదింపబడింది. 1896లో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభలో రవీంద్రనాథటాగూర్ ఆ గీతాన్ని పాడారు.

బంకించంద్ర చటర్జీ 1875లో కలకత్తా నుండి, స్వగ్రామాన రైల్లో వెళ్తూ, రైలు కిటికీ నుండి బయటికి చూస్తూ ఉన్నారు. నదీనదాలు, సస్యశ్యామలమైన బయళ్ళూ, ఫలపుష్పభరితమైన ఉద్యానవనాలు, కొండలు, లోయలు చూస్తూ భారత భూమి సుందర దృశ్యాలను తిలకిస్తూ పులకరించి పోయారు. ఆ మధురానుభూతుల నేపథ్యంలో వెలువడిన గీతం 'వందేమాతరం'.

బెంగాల్ రాష్ట్రవిభజన వంగరాష్ట్ర ప్రజలకు గుండెకోతలా బాధించింది. మహోద్యమం ప్రారంభమైంది.

ఉద్యమానికి బీజాక్షరంగా వెలువడింది వందేమాతరం. మహా యంత్రంలో ప్రజలను ఆవహించింది. జాతి నినాదంగా మారింది.

అప్పట్లో బెంగాల్ గవర్నర్ ఫుల్లర్, బహిరంగంగా 'వందేమాతరం' పాడటాన్ని నిషేధించారు.

ఒకసారి అలహాబాద్‌లో కొందరు యువకులు 'వందేమాతరం' అంటూ దిక్కులు పిక్కటిల్లేటట్లు నినాదాలతో ఊరేగింపు సాగించారు. పోలీసులు వారిని అరెస్టు చేశారు. ఈ వార్త విన్న జవహర్‌లాల్ స్వయంగా జైలు వద్దకు వెళ్ళారు. వందేమాతరం అంటూ నినాదాలు చేశారు. ప్రభుత్వం బంధితులనందరినీ విడుదల చేసింది.

బంకించంద్ర చటర్జీ డిప్యూటి మేజిస్ట్రేట్‌గా ఉండేవాడు. తన విధులను నిక్కచ్చిగా చేసేవారు. నిర్భయంగా ఉండేవారు. ఆంగ్లేయాధికారులు బంకిం బాబు పట్ల ఎంతో మర్యాదగా మసలుకొనేవారు.

బెంగాలీలు 'వందేమాతరం'ను 'బందేమాతరం' అంటూ పాడుతారు. ఆంగ్లేయులకు ఆ మాటలు 'బందూక్‌మార్'గా వినిపించేవి.

భారతజాతిని ఉత్తేజపరచి మహోద్యమానికి నాందీవాచకం పలికిన వీరగీతం 'వందేమాతరం'.

**జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

## విదురనీతి

"ఉత్తమానేవ సేవేత
ప్రాప్తకాలే తు మధ్యమాన్
అధమాంస్తు న సేవేత
య ఇచ్ఛేద్ భూతిమాత్మనః:"

ఎవడు తన ఉన్నతిని కోరుచున్నాడో, వాడు ఉత్తమ పురుషులను సేవించవలెను. అవసరము వచ్చునప్పుడు మధ్యమ పురుషులనన్న సేవింపవచ్చును గానీ, అధమ పురుషులను ఎప్పుడును సేవింపరాదు.

# బాబా జీవితమే జగతికి సందేశం

ఒకరి సందేశం వల్ల మరొకరికి ప్రయోజనం ఏమిటి? వాక్కుతో చెప్పినది విన్నవాడి మీద కల్గించే ప్రభావం ఏమిటి? అసలది నిజంగా ప్రభావాన్ని వేయగల్గుతుందా? అదే సత్యమైనట్లయితే వాక్చరుల చేత ఈ లోకం ఏనాడో దివ్యలోకం అయిఉండేది. వినేవాడి మనస్సు ఎప్పుడూ మాట్లాడేవాడి ప్రవర్తన, నడకలను పరిశీలిస్తుంటుంది. అందువల్లే నోటితో చెప్పే సందేశం కన్నా ఆచరణలో కన్పించే ఆదర్శం పరిశీలకుని మీద అనూహ్య ప్రభావాన్ని వేస్తుంది. వాక్కుకి అసలు ప్రభావమే ఉండదని కాదు. అది మనస్సు - ఆచరణలతో విరోధించకుండా శ్రుతి కలుపుకున్నప్పుడు మహాశక్తి వంతమవుతుంది. దీన్నే మనవాళ్ళు 'త్రికరణ శుద్ధి' అన్నారు. త్రికరణశుద్ధిని పొందినప్పుడు అతడి వాక్కు అమోఘం అంటే తిరుగులేనిది అవుతుంది. అట్లాగే అతడి సంకల్పం అంటే మనస్సు తిరుగులేనిది. అట్లాగే అతని కర్మ తిరుగులేనిది. ఇట్లాంటి శుద్ధపురుషులే 'మహా సిద్ధులు.' మహాసిద్ధులే అవతార పురుషులు.

అవతార పురుషుడి జీవితం గత ప్రారబ్ధం చేత నడిచేది కాదు - అది 'స్వ సంకల్పితం'. అది యాంత్రికం కాదు. పరమచైతన్య విలసితం. అది ప్రయోజకం కాదు. పరమ ప్రయోజనవంతం; మామూలు మానవుల జీవితాలు ఎక్కువ భాగం ఇతరులకేమీ, అటు మంచికి కాని చెడుకి కానీ, ప్రేరేపించవు. మన జీవితాలు ద్వంద్వాత్మకాలు. అవి కష్ట సుఖమయం. అవతార పురుషుడు ద్వంద్వాతీతుడు. మాయ అతనికి లోబడి ఉంటుంది. మాయతోనే లోకాన్ని నడుపుతున్న పరమేశ్వరుడు అవతరించి వచ్చినప్పుడు ఆ తన జీవన కాలంలో మాయను తొలగించి మూల సత్యాన్ని సాధకులకు చూపుతుంటాడు. అనుభవంలోకి తెస్తుంటాయి. ఈ తేవడమే ఆయన సందేశం. ఇది వాక్పూరితం కానక్కరలేదు. ఇది కేవలం అనుభూతి పూరితమైంది. బాబా వారి 'మహిమ'లన్నీ ఈ అనుభూతి మనకు కల్గడం కోసరమే.

భాట్టం శ్రీరామమూర్తి గారు "బాబా జీవితమే జగతికి సందేశం" అన్న ఆ గ్రంథం చదువుతుంటే పై విధంగా అనిపిస్తుంది మనకు. 500పుటల ఈ గ్రంథం చదువుతుంటే మనం సాయిలోకంలో సాయిరాముడితో సాలోక్య సాయుజ్య స్థితిని పొందుతున్నట్లే అనిపిస్తుంది.

ఈ గ్రంథాన్ని చదువుతున్నప్పుడు కొంతసేపు అద్భుతాశ్చర్యాలలో మునిగిపోతాం. మరికొంతసేపు మన అదృష్టాన్ని మనం ప్రశంసించుకొంటాము. ఇంకొంతసేపు బాబాతో మనకున్న కొద్ది కొద్ది అనుభవాల రహస్యాలను విశ్లేషించుకొంటాము. ఇంకొంచెంసేపు 'శ్రీరామమూర్తి గారెంత ధన్యులు'. ఇంత గొప్ప గ్రంథం రాయడానికి భగవాన్ ఆయన్ని ఎంతగా అనుగ్రహించి ఉంటారో అని అనుకొంటాము. చివరగా మనం 'శాంత'చిత్తుల మవుతాము. ఇలాంటి గ్రంథాలకి చివరి అంశమే ప్రధానం. ఏ నవలో, ఏ కావ్యమో కాదిది. ఇందులోది ఊహాత్మక కాల్పనిక జగత్తు కాదు. ఇందులోని స్వామి జీవితం, స్వామి ఉపదేశాలు అన్నీ పరమ సత్యాలు. వాటిని వింగడించడంలో శ్రీరామమూర్తిగారిని భగవానుడు ఆవహించిన అంశం ప్రత్యక్షరంలోనూ కన్పిస్తుంది.

స్వామిని ఇంత తీయగా అందించిన ఈ గ్రంథం భక్తులకు చేయబోతున్న సేవ అపారం. కనుక ప్రతి ఒక్కరూ ఈ గ్రంథం స్వంతం చేసుకుంటే సముచితమైన న్యాయం చేకూర్చినవారమవుతాము.

**మదిగొండ వీరభద్రయ్య**

**గ్రంథ ప్రాప్తిస్థానము :**

**శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్ ట్రస్ట్**

**ప్రశాంతి నిలయం : 515 134, అనంతపూర్ జిల్లా.**

# భారతీయ సంప్రదాయాలలో దాగిన విజ్ఞానం

మన పెద్దలు అంటుంటారు - ఏయే కాలాలలో వచ్చే పళ్ళను ఆయాకాలాల్లో తింటే ఏ జబ్బులూ రావని. మన హైందవుల పూజా విధానంలో ఒక విశిష్టత ఉంది. భక్తి, భావంతో .భగవంతునికి పత్రం, పుష్పం, ఫలం, తోయం - వీటిలో దేన్నైనా అర్పించవచ్చు. పత్రం (ఆకు), పుష్పం (పువ్వు), ఫలం (పండు), తోయం (నీరు) ఎప్పుడూ ఉండేవి. ఫలాలు ఋతువులకు అనుగుణంగా వస్తుంటాయి. భగవంతునికి నైవేద్యంగా పండుని పెట్టి కుటుంబసభ్యులు ప్రసాదంగా తినడం ఆనవాయితీ. ఈ విధంగా చేయడం వల్ల ఏదో రూపంలో దేహానికి కావలసిన పోషక విలువలు గల పదార్థాలు ఫలాల రూపంలో అందుతాయన్న ఉద్దేశ్యంతో ఈ పద్ధతిని ప్రవేశపెట్టారు మన పూర్వులు. అయితే ఇటీవల ఇంగ్లండ్‌లో జరిగిన పరిశోధనలు , తాజాపళ్ళు దేహానికి అవసరమైన పోషక పదార్థాలను అందజేయడమేకాక, మానవుల సెక్స్ జీవితాన్ని కూడా ప్రభావితం చేస్తాయని నిరూపించాయి.

మస్తిష్కంలో "లింబిక్ సిస్టం" అని ఉంటుంది. ఆకలి, దప్పికల వ్యవహారాలు చూడడంతో పాటు, సెక్స్ సామర్థ్యాన్ని కూడా ఈ లింబిక్ సిస్టం అదుపు చేస్తుంది. ఇందుకు తాజాపండ్లు, కూరగాయలు ఎంతగానో దోహదం చేస్తాయి. బ్రిటీష్ శాస్త్రజ్ఞుల పరిశోధనల ప్రకారం కారట్‌లు, పుచ్చకాయలు, మామిడి పళ్ళు, స్పినాక్ (SPINACH), ఆఫ్రికాట్ (AFRICOT) మొదలైన వాటిలో లభించే 'ఏ' విటమిన్, రక్తంలో ఉండే కొలెస్టరాల్‌ని (క్రొవ్వు సంబంధిత రసాయనం) చురుకైన సెక్స్ హార్మోన్‌లుగా మారుస్తుంది. అలాగే బంగాళాదుంపలు, అరటిపళ్ళు మొదలైన వాటిల్లో ఉండే బి-విటమిన్ కూడా సెక్స్ హార్మోన్‌ల తయారీలో ముఖ్య పాత్ర వహిస్తుంది. మనిషి అలసి పోయినప్పుడు సెక్స్ హార్మోన్‌ల ఉత్పత్తి కూడా తగ్గిపోతుంది. అలసటను తగ్గించడానికి పొటాషియం ధాతువు సహాయపడుతుంది. అరటిలో ఇది పుష్కలంగా ఉండటంతో, దీనిని తినడం వల్ల అలసట తగ్గి సెక్స్ హార్మోనుల తయారీ ప్రేరేపిత మవుతుంది.

మన భారతదేశంలో మిరియం గురించి తెలియని వారెవరూ లేరు. ఇది మన వంటకాలలో ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. అసలు నాలుగు వందల ఏళ్ళ క్రితం పోర్చుగీసు వారు మనదేశంలో, దక్షిణ అమెరికా నుంచి తెచ్చి మిరపకాయలను ప్రవేశపెట్టకముందు, కారంకోసం మిరియాలనే వాడేవారు. మిరియాల వలె కారంగా ఉంటుంది. కనుకనే "మిరియంపుకాయ" అయి అదే "మిరపకాయ"గా మారింది. వంటకాలలోనే కాకుండా ఔషధంగా కూడా మిరియాలు ఎంతగానో ఉపయోగపడ్తాయి. పడిశం, గొంతునొప్పి, అజీర్తి వంటి రుగ్మతలు కలిగినపుడు మిరియాల కషాయం

కె.ఆర్.కె.మోహన్

తాగుతుండటం మన ఇళ్ళలో అలవాటే. ఈ మిరియాల నుంచి "పైపెరిన్" అనే ఆయుర్వేద ఔషదం లభిస్తుంది. దీనిని పొడుగుగా ఉండే నల్ల మిరియాలునుంచి తయారు చేస్తారు. ఈ ఔషధం అనేక వ్యాధుల నివారణలో ఉపయోగపడడమే కాకుండా అనేక అలోపతిక్ ఔషధాల సామర్థ్యాన్ని కూడా పెంచగలదని ఇటీవలి పరిశోధనలు నిరూపించాయి. జమ్మూలోని ప్రాంతీయ పరిశోధనా సంస్థకి చెందిన శాస్త్రజ్ఞులు ఈ విషయంలో ప్రశంసనీయమైన కృషి చేశారు. అలోపతి వైద్యంలో సల్ఫా మందులు, యాంటిబయాటిక్ మందులకు విశేష ప్రాధాన్యం ఉంది. అధిక శాతం వ్యాధుల్ని ఈ మందుల తోనే నయం చేస్తారు. వీటిలో రిఫామ్‌పైసిన్, యాంపిసిలీన్, టెట్రాసైక్లిన్ వంటి వాటిని తరచుగా వాడుతారు. ఈ మందుల్ని ఈ పైపెరిన్‌తో కలిపివాడటం వల్ల, ఆమందుల నైపుణ్యం 150 నుండి 250 శాతం వరకు పెరిగినట్లు శాస్త్రవేత్తలు కనుగొన్నారు. రక్తపుపోటు తగ్గించడానికి సర్పెంటినా, వాక్సిన్ వంటి మందులు వాడతారు. పైపెరిన్‌తో కలపడం వల్ల వీటి సామర్థ్యం కూడా బాగా పెరిగింది. అలాగే కుష్టు, క్షయ వ్యాధుల నివారణకు వాడే మందుల శక్తి కూడా పైపెరిన్ వల్ల బాగా పెరిగింది.

అలోపతిక్ మందులలో చాలా వాటి మూలంగా కొందరు రోగులకు రియాక్షన్ వస్తుంటుంది. పైపరీన్ కలపడం వల్ల ఈ అవకాశం కూడా బాగా తగ్గింది.

ఆధునిక పరిశోధనలు మన ప్రాచీనులు ప్రవేశ పెట్టిన అనేక పద్ధతుల వెనుక గల అనంతమైన విజ్ఞానాన్ని బహిర్గతం చేస్తున్నాయి. ■

# దగాకు, వంచనకు గురయి ఆత్మహత్య చేసుకున్న పరిశోధకుడు బంగోరె

1982 నవంబరు 2వ తేదీన నెల్లూరు పట్టణానికి చెందిన ఒక యువకుడు భాక్రానంగల్ ప్రాజెక్టుకు వచ్చి సట్లెజ్ నదిలో దూకి ఆత్మహత్య చేసుకున్నాడు. అతను ఎవరయిందీ , ఎందుకు ఆత్మహత్య చేసుకున్నదీ అప్పటికి ఎవరికీ తెలియదు. కాని తర్వాత ఆ వ్యక్తి సుప్రసిద్ధ పాత్రికేయుడు, సాహిత్య పరిశోధకునిగా, సుప్రసిద్ధుడైన బంగోరె అనబడే బండి గోపాలరెడ్డి అని తెలుగు ప్రజలు తెలిసి ఆశ్చర్యపోయారు. కుటుంబ కలతల వలన కాని, ఆర్థిక చిక్కులు వ్యక్తిగత సమస్యల వలన కాని ఆయన ఆత్మహత్య చేసుకోలేదని, ఉన్నత పదవులలో ఉన్న పెద్దల వంచనకు, దగాకు గురై నిస్పృహతో ఆత్మహత్య చేసుకున్నాడని తెలిసి పాత్రికేయులు, సాహిత్య పరిశోధకులు దిగ్భ్రమ చెందారు.

పరిశోధకునికి కావలసింది సత్యాన్ని వెలికి తీయాలన్న పట్టుదల. అవసరమైతే గడ్డివాములో ఇరుక్కుపోయిన సూదిని వెదికి బయటకు తీయగల ఓపిక పై విషయాలలో తృప్తి పడక పరిశోధనకు నిర్దుష్టతను సాధించాలన్న, నిజాయితీ. ఇవి బండి వారికి పుష్కలంగా ఉన్నాయి. ఇవికాక నిర్భయత్వం, నిర్మొహమాటత్వం నిజాన్ని కుండబద్దలుకొట్టినట్లు మాత్రమే కాక ఎదుటి వారెంత గొప్పవాడైనా మొహం పగిలేట్టు చాకుతో గీసినట్లు చెప్పగల సాహసం , న్యాయం తనదైనప్పుడు ఎదుటి వాడు ఎంత బలవంతుడైనా లెక్కచేయని ధిక్కార, ధీరణి ప్రదర్శించాడు. ఇవి ఒక్కొక్క సారి మితిమీరినందు వల్లనే బంగోరెఅనేక మందికి అందులో ఆప్తులు, మిత్రులు అనేవారికి శత్రువయ్యారు, వంచనలకు గురి అయ్యారు.

ఛార్లెస్ ఫిలిప్స్ బ్రౌన్ బహుముఖ వ్యక్తిత్వాన్ని మరింత వెలుగులోకి తెచ్చిన వ్యక్తి బంగోరె. తిరుపతిలో బ్రౌను పరిశోధనా కేంద్రం, హైదరాబాదులో వేమన విజ్ఞాన కేంద్రం, విశాఖపట్టణంలో సి.ఆర్. రెడ్డి పరిశోధనా కేంద్ర ప్రాజెక్టులలో పని చేసి పరిశోధన విషయం రాజీపడని తన వైఖరిని బంగోరె నిరూపించుకున్నారు.

బంగోరె పుట్టింది నెలూరు జిల్లా కోవూరు తాలూకా మనగల్లు గ్రామం. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి బి.కామ్. ఆనర్సు డిగ్రీ సంపాదించిన ఆయన తత్ సంబంధిత ఉద్యోగాల కోసం ప్రయత్నించలేదు. కడప జిల్లాలో సెంట్రల్ బ్యాంక్ అకౌంటెంట్ ఉద్యోగం లభించినా ఆయనకు తృప్తి లభించలేదు. పాత్రికేయ వృత్తి మీద

## కంచి వాసుదేవరావు

అభినివేశంతో వాల్తేరు ఆంధ్ర విశ్వ విద్యాలయంలో చదువుకున్న రోజుల్లోనే 'స్రవంతి' అనే వార పత్రికను పెట్టి నష్టపోయారు. విజయవాడలో 'ఆంధ్ర జ్యోతి' దిన పత్రికను నార్ల వెంకటేశ్వరరావు గారు స్థాపించినప్పుడు కొద్ది నెలలు సబ్-ఎడిటర్‌గా పనిచేశారు. కాని ఆయన పాత్రికేయ జీవితానికి సుస్థిరమైన పునాదిని వేసింది నెల్లూరు పత్రిక 'జమీన్ రైతు.'

**పాత్రికేయ జీవితం :** ఇక్కడ మనం ఆయన 'జమీన్‌రైతు' పత్రిక గురించి కొద్దిగా చెప్పుకోవాలి. 1930 దశకంలో దేశ భక్తుడైన నెల్లూరు వెంకట రామానాయుడు గారు జమీందారి రైతుల కోసం ఈ వార పత్రికను స్థాపించారు. అది ఆనాటి నుంచి నేటి వరకు నెల్లూరు మండల ముఖవాణిగా పనిచేసింది. ఆ ప్రజల జీవితాలలో తాదాత్మ్యం చెందింది. ఆణి ముత్యాల వంటి జర్నలిస్టు లను తయారు చేసింది. 1964 నుంచి 1971వరకు బంగోరె ఆ పత్రికలో ఉపసంపాదకునిగా పనిచేశారు. వార్తా కథనంలోనూ, రాజకీయ వ్యాఖ్యల్లోనూ, గ్రంథ విమర్శనాదుల్లోనూ తనదైన పద్ధతిని ప్రవేశపెట్టారు. ఆ సమయంలో జీవితాన్ని మలుపు తిప్పిన సంఘటన జరిగింది. అమెరికన్ తెలుగు సమాచార కేంద్రం తన వెలుగు వెలుగుతూ లెటర్లకు అనువాదకునిగా

నియమించింది. ఆ విధంగా బంగోరె మద్రాసు వెళ్ళారు.

చాలా మంచి జీతం, నిర్ణీతమైన పని గంటలు, సెలవలు. తనకు తీరిక లభించిన ప్రతి నిమిషాన్ని మద్రాసు పబ్లిక్ లైబ్రరీలో దాగిఉన్న తదితర ప్రాచీన పుస్తకాలు , పత్రాలను పరిశోధించి అనేక విషయాలను బయటకు తెచ్చారు. ఆంధ్ర దేశానికి సంబంధించిన సాహిత్య విశేషాల ఉనికిని కనుగొన్నారు. సాహిత్యంలో దాగిఉన్న చారిత్రకాంశాలపై పరిశోధన సాగించారు. ఆయన కృషి ఆనాటి వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖ అధిపతి ఆచార్య జి. ఎన్. రెడ్డిని ఆకర్షించింది. బ్రౌన్ పరిశోధన పీఠాన్ని విశ్వవిద్యాలయంలో స్థాపించాలని ఆయన తలపోసారు. ఆ ప్రాజెక్టుకు అధినేతగా ఉండవలసిందిగా బంగోరెను ఆయన ఆహ్వానించారు. బ్రౌన్ దొర పట్ల మొదలు నుంచి బంగోరెకు అభిమానం ఉంది. ఆరుద్ర, నేలనూతల శ్రీ కృష్ణమూర్తి వంటి చరిత్ర పరిశోధకుల విచ్చిన్న స్ఫూర్తితో బంగోరే బాధ్యతను స్వీకరించారు.

**బ్రౌన్ గురించి 52 సంపుటాలు :**

ఈ ప్రాజెక్టు 3 సం॥లు పని చేసింది. తరువాత మరో ఆరు నెలలు అతి కష్టం మీద నడిచింది. ప్రభుత్వం దీనికి సహాయం నిలిపివేసింది. ఇటీవలి కాలంలో ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి రోజుకు 5లక్షల రూపాయలు ఖర్చుపెట్టి అనేక రోజులు ఢిల్లీ, హైదరాబాదు మధ్య యాత్రలు జరిపారు. ప్రతి సంవత్సరం ప్రభుత్వం అనేక వందల కోట్ల రూపాయలు వృధా వ్యయం, ఆడంబర వ్యయం చేస్తోంది. కాని ఒక మంచి ప్రాజెక్టుకు నిధులు లేనందువలన నిలిచిపోయింది. కడపలో బ్రౌను నివసించిన బంగళాను ఉద్ధరించి, బ్రౌను రీడింగు రూముగా తీర్చిదిద్దటానికి జానుమద్ది హనుమచ్ఛాస్త్రి గారికి ప్రేరణ ఇచ్చింది బంగోరె. ఈ మూడున్నర సంవత్సరాల స్వల్ప కాలంలో బంగోరె బ్రౌన్ జీవిత పరిశోధనపై అనల్ప కృషి చేశారు. లండన్‌లోని ఇండియా ఆఫీసు బ్రిటీష్ మ్యూజియం నుంచి బ్రౌను రచనలు అముద్రిత వ్రాత ప్రతులతో సహా అమూల్యమైన సమాచారాన్ని 52 సంపుటాలుగా మైక్రోఫిలిముల ద్వారా సేకరించారు. ఇందులో రాష్ట్ర ప్రభుత్వం అందించిన ఆర్థిక సహాయం కేవలం 15వేల రూపాయలు.

ఈ ప్రాజెక్టు తరుపున బంగోరె బ్రౌన్ పై రచించిన మూడు గ్రంధాలను శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం ప్రచురించింది. అవి బ్రౌన్ లేఖలు బ్రౌను జాబులలో స్థానిక చరిత్ర శకలాలు. ఆంధ్ర గీర్వాణ సంఘం "లిటరరీ ఆఫ్ బయోగ్రఫీ ఆఫ్ సి.పి. బ్రౌను".

1832 అక్టోబరు ఒక పాశ్చాత్యుడు, ముగ్గురు దేశీయులు మద్రాసు నుంచి తెలుగు, తమిళ భాషలలో ఒక వార పత్రికను స్థాపించడానికి 1838లో తెలుగులో వచ్చిన పత్రిక 'వృత్తాంతి' గురించిన అప్పటి ఒక అర్జీ పత్రాన్ని పంపారు. ఆ అర్జా నఖలును బంగోరె స్వీకరించి బ్రౌన్ లేఖలలో జేర్చారు. గవర్నరుకు పంపిన ఆ పత్రిక ప్రాస్పెక్టస్‌కు చేర్చారు.

1838లో రాజమండ్రి జడ్జిగా థామస్ అనే వారు ఉండేవారు. ఆయన భార్య జులియా థామస్ లండన్ లోని తన స్నేహితులకు రాజమండ్రి విశేషాలు వ్రాసేది. 1838లో రాజమండ్రిలోని ఒక రీడింగ్ రూం గురించి రీసెర్చి కేంద్రాన్ని ఏర్పాటు చేసింది. అవతల సి.ఆర్.రెడ్డి విశేషాలు 1842లో వచ్చిన వర్తమాన తరంగిణి నుంచి బ్రౌన్ పదిల పరచిన వ్యాసాలు ఇంకా అనేక చారిత్రక ప్రాధాన్యం గల విశేషాలను బంగోరె బ్రౌన్ లేఖలలో వివరించారు.

రాజమండ్రి వాస్తవ్యులు బొమ్మరాజు నాగేశ్వరరావు వృత్తాంతి పత్రికలో పడిన ఒక వార్తను పురస్కరించుకొని రాసిన ఉత్తరం, మచిలీపట్టణం వాస్తవ్యుడు బుర్రా వెంకట శేషాల శాస్త్రి ఉద్యోగం ఇప్పించవలసిందిగా బ్రౌనుకు వ్రాసిన ఉత్తరాన్ని బంగోరె బయట పెట్టారు.

**పెరంల దగా**

బ్రౌన్ రీసెర్చి ప్రాజెక్టు నిలిచి పోయాక బంగోరె యోగి వేమన విజ్ఞాన కేంద్రానికి వెళ్ళి వేమన పై పరిశోధన ప్రారంభించారు. కాని అక్కడి అధికారుల దురహంకార ప్రవర్తనతో ఆత్మ గౌరవాన్ని ఎంతమాత్రం వదలుకోని బంగోరె భరించలేక రాజీనామా చేశారు. తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పాటు చేసిన విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులైన సి.ఆర్.రెడ్డి గొప్ప వ్యక్తుల గురించి రాసిన

వ్యాసాలను సంకలనం చేశారు. కాని ఆంధ్ర విశ్వ విద్యాలయంలో పలుకుబడిగల ఒక మహనీయుని పేరుని ప్రచురించబడింది. ఈ మోసాన్ని బంగోరె తట్టుకోలేక పోయారు. మానసికంగా క్రుంగిపోయాడు. చివరకు అది ఆత్మహత్య చేసుకోవడానికి దారి తీసింది.

ఇవికాక మాలపల్లి నవల, ప్రభుత్వ నిషేధాలు, కన్యాశుల్కం నాటకం నాటి సామాజిక పరిస్థితులను అధ్యయనం చేసి ఆనాటి సామాజిక స్థితిగతులను కళ్ళకు కట్టే గ్రంథం రాశారు. గురజాడ వారి జన్మదినం 30-11-1851 కాదని 21-9-1862 అని నిరూపించారు.

తెనాలిలో నేను కృష్ణాపత్రిక సబ్ ఎడిటర్‌గా పనిచేస్తూ ఉండగా బంగోరె ఆ పత్రిక ఆఫీసుకు బందరు నుండి వచ్చారు. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారికి రాజద్రోహనేరం క్రింద శిక్ష విధిస్తూ కృష్ణాజిల్లా కోర్టు 1907లో ఇచ్చిన తీర్పు ప్రతి అది.

బంగోరె ఆత్మహత్య చేసుకున్న విషయం తెలిసిందే. కాని దాని వెనుక నున్న మిస్టరీ తొలగలేదు. దగాకు, వంచనకు గురయి తీవ్ర నిరాశతో ఆత్మహత్య చేసుకోదలచిన బంగోరా స్వస్థలం నెల్లూరులో కాక ఎక్కడో బాక్రానంగల్ ప్రాజెక్టుకు వెళ్ళి సట్లెజ్ నదిలో దూకి ఆత్మహత్య ఎందుకు చేసుకోవలసి వచ్చింది? మనశ్శాంతికి అక్కడికి బంగోరె వెళ్ళిఉంటారని అక్కడ అనుకోకుండా తీవ్రమైన మానసిక డిప్రెషన్‌కు గురయి తట్టుకోలేక ఆత్మహత్య చేసుకున్నాడేమో!

బంగోరెను తలచుకుంటే మహాకవి శ్రీశ్రీ మహాప్రస్థానంలో ఉదయిని సంపాదకుడు కొంపల్లె జనార్దనరావు మరణించినప్పుడు రాసిన శోకగీతిలోని ఈ క్రింది వాక్యాలు గుర్తుకువస్తాయి.

"అడుగడుగునా పొడచూపే
అనేకానేక శత్రువులతో
పొంచి చీకట్లే కరవజాచే
వంచకాల ఈ లోకంలో పొసగక
అంచి తానంత శాంత సామ్రాజ్యం
దేన్ని వెదుక్కుంటూ వెళ్లావోయీ నేస్తం.

బంగోరె జీవితం అర్థాంతంగా ముగిసి ఉండవచ్చు. కాని ఆయన బతికి ఉన్నంతకాలం అర్థవంతంగానే జీవించారు. ●

# పదాల పందిరి - 8

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | X | 3 | | 4 |
| | X | 5 | 6 | | X | |
| 7 | 8 | X | | X | 9 | |
| X | 10 | | X | 11 | | X |
| 12 | | X | 13 | X | 14 | 15 |
| | X | 16 | | 17 | X | |
| 18 | | | X | 19 | | |

**అడ్డం :**

1. పరిపాలించువాడు
3. హనుమంతుడు
5. రాజ్యాధిపతి
7. దిక్కు
9. మోసానికి కావలసినది
10. నారాయణపత్ని
11. హృదయము చిన్నదైతే?
12. నోటుకు వ్రాలు.....!
14. కవిత్వపు కర్త
16. అక్క.........చెల్లి..........
18. అంతం
19. శివకంఠమణి

**నిలువు :**

1. పన్నెండు నెలల కాలం
2. ఏనుగు
3. 'బాగు' చేయుటం కాదు
4. కేవలం 60 సెకన్లే
6. స్పర్శ నివాస స్థానం
8. అభయం కోరుట
9. స్టేజ్
12. వయస్సు
13. కౌమోదకి
15. డొనేషన్
16. సబ్బు
17. గరిక చివర విరిగి తలక్రిందులైంది

-కిరీటి

# అపమార్గం అనర్థాలకు దగ్గరి దారే !

★★★★★★★★★★★★★★★★★★★★★★★★

బ్రిటను మాజీ యువరాణి, అతిలోక సుందరి డయానా అకాలమృత్యువువాత పడింది. పుట్టిన ప్రతి జీవికి మరణం సహజమే అయినా, తప్పనిసరిముగింపే అయినా, మరణం ఎప్పుడైనా, ఎవరికైనా దుఃఖభాజకమే అవుతుంది. అంతో, యింతో పేరు ప్రఖ్యాతులున్నవారు, పదుగురికి తెలిసినవారు ఏ ప్రమాదవశాత్తో మరణిస్తే, అదే మరింతగా విషాదభరితమవుతుంది. డయానా మరణం అట్లా దుఃఖ కారకమే అవుతుంది.....అందరికీ. ఏ సంజయ్ గాంధీ మరణంలాగానో!

కాకపోతే డయానా, సంజయ్, ప్రభృతులు అకాల అసహజ మరణాలు కొంత వరకు హెచ్చరికలుగా కూడా ఉపయోగపడ్తాయి. మరణించిన వారిని గురించి చెడు మాట్లాడకూడదనేది ప్రపంచ వ్యాప్తంగా పాటించే నియమమే అయినా హెచ్చరికల నందించే అంశాలు ప్రస్తావించుకోవడం అవసరమే కావచ్చు.

డయానా అందాలరాశి. సామాన్య కుటుంబీకురాలు. ఉపాధ్యాయినిగా జీవితం ఆరంభించింది. అదృష్టమో, దురదృష్టమో ఆమె అందం బ్రిటీష్ యువరాజు ఛార్లెస్ కంటిని ఆకర్షించింది. రాజవంశపు మర్యాదలను, సంప్రదాయాలను అతిక్రమించి ఆయన డయానాను వివాహమాడాడు. రాకుమారుడాయన. సంప్రదాయ విరుద్ధంగా పెండ్లాడిన భార్యతో ఆయన సంప్రదాయకమైన పవిత్ర జీవితాన్ని గడపలేకపోయాడుట. స్త్రీలోలత్వం ఆయునను వెంబడించేదిట. దానిని డయానా సహించలేకపోయింది. అసహజ, అపమార్గాలలో దానిని నివారింప చూసిందట. తనకు వివాహేతర సంబంధాలున్నట్లు ఆమె ప్రచారం జరుగనిచ్చింది. అదంతా రాజవంశానికే తలవంపులైతే ఆమె సంతోషించినదేమో? కాని విడాకులకది దారి తీసేటప్పటికి ఆమె భరించలేకపోయింది. యువరాజుతో వివాహ విచ్ఛిత్తి తర్వాత, ఆమె ఒక విధమైన కక్షతో, ప్రతీకారేచ్ఛతో 'డోడీ' అనే భాగ్యవంతునితో ప్రేమ కలాపాలు ప్రారంభించింది. విడాకులు పుచ్చుకున్న వారు, వితంతువులు పునర్వివాహం చేసుకోవడం పాశ్చాత్య దేశాల సాంప్రదాయమే. అట్లా సంప్రదాయ బద్ధంగా ఆమె

## కీ॥శే॥ ఆర్. ఎస్. కె. మూర్తి

డోడీనో, మరొకరినో ప్రేమించి పెండ్లి చేసుకుంటే సరిపోయేది. అట్లా చేయలేదామె. బ్రిటీష్ రాజవంశం పరువు తన చేతనైన మేరకు తీయాలనే ప్రతీకారేచ్ఛతో ఆమె డోడీతో స్వేచ్ఛా విహారం సలుపసాగింది. ఇద్దరు ఎదిగి వచ్చిన పిల్లల తల్లి, అతిలోకసుందరి ఆమె స్వేచ్ఛా విహారాలు పత్రికలవారికి వ్యాపార వస్తువులయినాయి. ఆమె రహస్య కలయికల ఫోటోలకై వెర్రెత్తి పోయింది బ్రిటను స్వేచ్ఛా విపణి. ఆ ఫోటో గ్రాఫర్ల వేట నుండి తప్పించుకొనే ప్రయత్నమే ఆమె ఘోర మరణానికి దారి తీసినదంటున్నారు.

మనలో కూడా ఇటువంటి బలహీనతలు కన్పిస్తూ ఉంటాయి. మనకెవరి మీదనో కోపం వస్తుంది. ఏదో ఒక చెడుకి పాల్పడి, ఆ కోపాన్ని తీర్చుకోవాలనుకుంటాం. పెళ్ళాం మీద కోపం వస్తే త్రాగి యింటికి వెళ్ళటం ఆమెకు తగిన శిక్ష అనుకుంటాం. తండ్రి మీద కోపం వస్తే చదువు మానేసి పరీక్షలు తప్పడం ఆ తండ్రికి శిక్ష అనుకుంటాం. కాని, ఆ విధానం అపమార్గమనీ, అది అనర్థాలకు దారి తీస్తుందని మనం గమనించలేం. అపమార్గమెప్పుడూ అనర్థాలకే దారి తీస్తుంది.

సంజయ్ గాంధీ విషయంలోనూ యిట్లాగే జరిగింది. ఆయన దేశపు మంచిని ఆశించాడు. కాని దానినంతా అపమార్గాన సాధించాలని ఆలోచించాడు. తల్లీ కొడుకులు కలిసి ఎమర్జెన్సీ దయ్యాన్ని ఆవాహన చేశారు. దేశ ప్రజ యిద్దరినీ జోడించి శిక్షించింది. అయినా వారి కళ్ళు తెరుచుకోలేదు. మళ్ళీ యిద్దరూ ఎన్నికల్లో గెలవడం అదో హైప్ (మత్తు) అయింది. విమానం నడిపే కమాండో నియమాలు వారికుంటాయి. అన్ని నియమాలనూ అతిక్రమించి ప్రవర్తించుటయే గొప్పతనమనుకున్నాడో ఏమో, సంజయ్ నియమ విరుద్ధంగా గాలిలో పల్టీలు కొట్టించాడు విమానాన్ని. బొమ్మ విమానంలా అది భూమిని గుద్దుకుంది. సంజయ్ అకాల మృత్యువాత పడ్డాడు. నియమ విరుద్ధమైన ప్రవర్తన, అపమార్గాన నడవటం - అది సుగమ్యాలకు మనలను చేర్చదు. అనర్ధాలకే అది దారి తీస్తుంది.

డయానా మరణం సందర్భంలో మరో వ్యాఖ్య కూడా విన్పిస్తున్నది. బ్రిటన్‌లో స్వేచ్ఛా విపణి మొదటి నుంచే అమలులో ఉంది. ఇట్టి విపణిలో గొంతులు కోసుకునే పోటీ ఉంటుంది. సిటీ బస్సులు ప్రైవేటువారివైతే, అవి రోడ్డు మీద ఎట్లా పోటీపడుతుంటాయో మనం ప్రతీ నగరంలోనూ పరికిస్తూనే ఉంటాం. పది పైసల టికెట్టు, కోయటానికి,ఆ బస్సులవారు ఎటువంటి ప్రమాదాలనూ పట్టించుకోరు. బ్రిటన్ పత్రికల మధ్య, టి.వీ. మధ్య ఇట్లాంటి పోటీనే ఉంది. డయానా అక్రమ ప్రణయాల ఫోటోలతో అక్కడి పత్రికా ఫొటోగ్రాఫర్లు లక్షాధికారులవు తుంటారుట. ఆ లక్షల పోటీ మనస్తత్వం తోనే వారు డయానా, డోడీలున్న కారును వెంబడించారు. వారిని మృత్యువు వరకు తరిమికొట్టారు.

ఇప్పుడిప్పుడే మన దేశంలో కూడా పత్రికలు, టి.వీ.ఛానల్సు మధ్య ఇటువంటి ప్రమాదకరమైన పోటీ ప్రారంభమవుతున్నది. సెన్సేషనల్ వార్తలను యివ్వాలని ప్రముఖ దినపత్రికలు రోజుకో వార్తను వండి, తమ పేజిలలో వడ్డిస్తున్నాయి. రాజకీయ నినాదాలు, అక్రమ సంబంధాలు, రహస్య ప్రణయాలు వంటివి మన దిన పత్రికలకు కూడా చక్కటి వ్యాపారపు సరుకే అవుతున్నాయి.

అట్లాగే టి.వి ఛానల్స్ ఒక దానిని మించి మరొకటి అశ్లీలతను, హింసాప్రవృత్తిని, అనాలోచిత ఆలోచనలను, విశృంఖలత్వాన్ని రెచ్చగొట్టే కార్యక్రమాలను పోటీమనస్తత్వంతో రూపొందిస్తున్నాయి. ఒక ఛానల్ మిడ్‌నైట్ మసాలా పాటలను చూపిస్తే, మరొక ఛానల్ అర్ధరాత్రి పాటలను అందిస్తోంది. ఒక ఛానల్ సెంటిమెంటల్, మెలోడ్రమెటిక్ చెత్తను ప్రచారం చేస్తే మరొ ఛానల్ హింసాపూరిత సీరియల్‌ను టెలికాస్ట్ చేస్తుంది. ఇట్లా స్వేఛ్ఛా విపణి పేరుతో మనం ఆరంభించిన ఆర్ధిక సంస్కరణలు, ఆర్ధిక సంపదను పెంచకపోయినా, ఆ విపణికి రెండు అంతర్భాగమైన అనర్ధాలను మాత్రం పెంచుతున్నాయి.

నేటి యువత సర్వస్వాన్ని పరిత్యజించి, ఈ టి.వీ ఛానల్స్‌కు, పత్రికల చెత్తకు, సినిమాల చెమటకు పరవశులవుతున్నారు. ఇటువంటి అపమార్గాలన్నీ అనర్ధాలకే వారిని నడిపిస్తాయని గుర్తెరుగలేకపోతున్నారు.

యువతే గొంతెత్తి వేటికైతే వ్యతిరేకంగా ఉద్యమించాలో అట్టి అపమార్గాలకు యువతే మొదటి బలి పశువులవుతున్నారు. యువతా వాణి సరిగ్గా ధ్వనిస్తే తప్ప జాతి వికసించదు. ☆

## సుభాషితములు

"నాస్తి లోభ సమోవ్యాధి:
నాస్తి క్రోధ సమోరిపు:
నాస్తి దారిద్ర్యవత్ దుఖం
నాస్తి జ్ఞానాత్ పరం సుఖమ్."

లోభముతో సమానమైన రోగము లేదు. కోపముతో సమానమైన శత్రువులేదు. దారిద్ర్యము వంటి దు:ఖము లేదు. జ్ఞానము కంటే గొప్పదైన సుఖము లేదు.

# ఓసిస్, హెరాల్డ్‌సన్

"ఎంత మంది శాస్త్రజ్ఞులు ఎన్ని పరికరాలతో, ఎన్ని సంవత్సరాలు పరీక్షించినా, నా గురించి తెలిసికోలేరు. కాని, ప్రేమ, హృదయ నిర్మలత కలిగిన వారికి నా గురించి సత్యం కొంతైనా తెలుసుకోవటానికి ఎక్కువ కాలం పట్టదు.''

-బాబా

డాక్టరు ఓసిస్, డాక్టరు హెరాల్డ్‌సన్ అమెరికా దేశంలో పేరు మోసిన శాస్త్రవేత్తలు. వీరిద్దరికి అనేక పి. హెచ్. డి. డిగ్రీలున్నా పరిశోధనాతృష్ణ తీరలేదు.

వీరిద్దరూ 1973వ సంవత్సరంలో ఓ కొత్త అంశం పరిశోధనకు ఎన్నుకున్నారు. అది నిర్జీవమైన రాయి, రప్పా గురించీ, అల్పజీవులైన కప్పా, పాము గురించీ, బుద్ధి, మనసు వికసించిన ఉత్తమ ప్రాణి మనిషి గురించి కూడా కాదు. సాక్షాత్తు పర బ్రహ్మ స్వరూపుడైన భగవాన్ సత్య సాయిబాబానే వీరు పరిశోధనా అంశంగా ఎన్నుకున్నారు. ఆ నిర్ణయం వీరిద్దరు హోవార్డ్‌మర్ఫెట్ రాసిన "సాయిబాబా, మాన్ ఆఫ్ మిరకిల్స్'' (అద్భుతమూర్తి) అనే పుస్తకం చదివిన తర్వాత తీసుకున్నారు. కాని ఈ నిర్ణయం అహంకారంతో గాని, స్వామి చేసే మహత్తులు ఒట్టి మాజిక్ ప్రదర్శనలన్నీ, ప్రచారం చేయాలనే దురుద్దేశంతో గానీ తీసుకున్నది కాదు. స్వామిలో ఉన్న దివ్యత్వం కొంచెమైనా వీరి పరిశోధనల కందితే, దానిని విజ్ఞాన శాస్త్ర ప్రపంచానికి తెలియజేయాలనే సదుద్దేశ్యంతో వీరిద్దరూ భారతదేశానికి వచ్చి ప్రశాంతి నిలయానికి చేరుకున్నారు.

పరిశోధనకు నాందిగా, స్వామి గురించి మర్ఫెట్ రాసిన పుస్తకంలోని అనేక లీలలు గురించి, ఆ పుస్తకంలోనే తెల్పబడిన భక్తులను ప్రశ్నించి, మర్ఫెట్ తన పుస్తకంలో స్వామి లీలలను గురించి ఏ అతిశయోక్తులు వ్రాయలేదని నిర్ధారించుకున్నారు.

ఆ తర్వాత స్వామి వారికి అనేక ఇంటర్వ్యూలిచ్చారు. మొదటి ఇంటర్వ్యూలో ఇద్దరికీ విభూతి, డాక్టర్ ఓసిస్‌కు ఒక బంగారు ఉంగరం సృష్టించి ఇచ్చారు. శాస్త్రజ్ఞులిద్దరి కళ్ళూ స్వామి ప్రతి కదలికనే గాక, ఆ గదిలో ఉన్న వస్తువులనూ, ఆ గదినీ, స్వామి ధరించిన అంగీని, స్వామి జుట్టునూ నిశితంగా పరిశీలించారు. కానీ విభూతి, ఉంగరం ఎక్కడి నుండీ వచ్చాయో వారికర్థం కాలేదు.

## డి. వెంకటేశ్వరరావు

ఒకరోజు వారిద్దరూ "అనువైన వాతావరణంలో శాస్త్ర పరిశోధన'' అనే విషయం మీద స్వామితో చర్చ మొదలుపెట్టారు. స్వామి ఈ చర్చను ఆధ్యాత్మిక జీవనం అనే అంశం మీదకు మరల్చారు. "ఆధ్యాత్మిక జీవనం, దైనందిక జీవనం రెండు ముఖాల (కవల) రుద్రాక్షవలె పెరగాలి'' అని చెప్పారు. అమెరికాలో పుట్టి పెరిగిన వారిద్దరికీ రుద్రాక్ష అంటే ఏమిటో అర్థం కాలేదు. రుద్రాక్షంటే చాలా పవిత్రమైనదనీ, రెండూ ముఖాల రుద్రాక్ష చాలా అరుదైనదనీ అనువాదకుడు చెప్పినా వారికర్థం కాలేదు. అప్పుడు స్వామి కొంచెం అసహనంగా తన కుడిచేతి గుప్పెట మూసి గాలిలోకి చేయిని తిప్పి, గుప్పెట తెరిచారు. అందులో ఒక ద్విముఖ రుద్రాక్ష ఉంది. ఆ రుద్రాక్షను చేతిలోనే ఉంచుకొని స్వామి హెరాల్డ్‌సన్ వైపు తిరిగి 'నీ కొక బహుమతి ఇవ్వాలని ఉంది' అని చెప్పి తిరిగి గుప్పెట మూసి చేతిని గాలిలో త్రిప్పి గుప్పెట తెరిచేసరికి ఆ జంట రుద్రాక్ష అలాగే ఉంది. కానీ ఈ సారి ఆ రుద్రాక్షలకు రెండు వైపుల చక్కని నగిషీ చేయబడిన బంగారపు తొడుగు, పై భాగాన ఎర్రని రాయి పొదగబడిన బంగారపు శిలువ, ఆ శిలువ వెనుక భాగాన గొలుసుకు

తగిలించటానికి వీలుగా చిన్న రింగూ, అంతా కలిసి చక్కని ఆభరణంలా ఉంది. ఆ సృష్టినీ , సృష్టి మీద మరో సృష్టినీ చూసి ఆ శాస్త్రజ్ఞులిద్దరూ అవాక్కయ్యారు.

అయినా శాస్త్రజ్ఞులకు అనుమానాలెక్కువ. నమ్మకం తక్కువ. మరొక ఇంటర్వ్యూలో స్వామిని నియమబద్ధ వాతావరణంలో పరిశోధించటానికి అంగీకరించమని కోరారు. " అది తరువాత, ముందు నీ ఉంగరం చూసుకో" అన్నారు స్వామి డాక్టర్ ఓసిస్‌తో, అంతకు రెండు రోజులముందే స్వామి సృష్టించి యిచ్చిన ఆ ఉంగరంలోని స్వామి బొమ్మ ఉన్న రాయి కనబడలేదు. ఆ గదిలోకి వచ్చినప్పుడు కూడా ఆ రాయి ఉంగరంలో గట్టిగా బిగింపబడివుంది. ఆ రాయిని పట్టి ఉంచిన కొక్కేలు యధావిధిగానే ఉన్నాయి. ఆ రాయి క్రిందపడిపోవాలంటే ఆ కొక్కేలలో కొన్ని విరిగిపోయి అయినా ఉండాలి, లేదా రాయి చిన్న చిన్న ముక్కలై రాలిపోయి అయిన ఉండాలి. కానీ అవేమీ జరుగలేదు. ఆ రాయి కోసం ఆ ఇద్దరు శాస్త్రజ్ఞులూ, ఆ సమయంలో అక్కడే ఉన్న మరో ఇద్దరు విదేశీయులు కలసి ఆ చిన్న ఇంటర్వ్యూ గదినంతా వెదికారు. వీరి అవస్థ చూచిన స్వామి కొంటెగా వారి వంక చూస్తూ 'ఇది నా ప్రయోగం' అన్నారు.

మరి రెండు రోజుల తర్వాత స్వామి మరొకసారి పిలిచి వీరిద్దరినీ ఇంటర్వ్యూకి పిలిచారు. డాక్టర్ ఓసిస్‌ను చూస్తూ "ఈ ఉంగరంలోని రాయి మళ్ళీ కావాలా;" అని అడిగారు.. కావాలని చెప్పాడు ఆ శాస్త్రజ్ఞుడు. స్వామి ఆ ఉంగరాన్ని తీసుకుని గుప్పెటలో ఉంచుకొని రెండుసార్లు ఊది గుప్పెట తెరిచారు. రెండు రోజుల క్రిందట మాయమైన ఆ రాయి తిరిగి యధాస్థానంలో ఉంది. ఆ ఇంటర్వ్యూలోనే స్వామి ఒక అమెరికా స్త్రీకి రవ్వల నెక్లెస్, ఆమె భర్తకు బంగారు ఉంగరం సృష్టించి ఇచ్చారు. మరొక వృద్ధ అమెరికన్ దంపతుల వైపు తిరిగి " ఈ రోజు మీ 33వ వివాహ దినోత్సవం కదూ!"అని అడిగారు. అవునని చెప్పటానికి వారికి కొంత సమయం పట్టింది. అప్పుడు స్వామి ఒక బంగారు ఉంగరం సృష్టించి వణుకుతున్న ఆ భార్య చేతులలో ఉంచి, ఆమె భర్త వేలుకు తొడగమని చెప్పారు. మళ్ళీ చేతిని గాలిలో త్రిప్పి ఒక బంగారు కమలంతో ఉన్న నెక్లెసుని సృష్టించి భర్త చేతికిచ్చి భార్య మెడలో వేయమన్నారు.

అక్కడ ఉన్న కొద్ది రోజులలో ఇటువంటి లీలలు అనేకం చూసే అవకాశం దొరికింది ఆ శాస్త్రజ్ఞులిద్దరికీ. వారి అంచనా ప్రకారం స్వామి ఇటువంటి లీలలు రోజుకు 20 నుండి 30 దాకా గత మూడు దశాబ్దాలుగా చేస్తున్నారు.

తరువాత వారిద్దరూ అక్కడ నుండి కేరళలోని మంజేరికి వెళ్ళి ఒక విషయం విచారించారు. అంతకు కొద్ది సంవత్సరాల ముందు స్వామి వెంకటగిరిలో ఉంటూ, అదే సమయంలో మరొక శరీరంతో కేరళలోని మంజేరిలో ఉన్న రామమోహనరావు అనే వ్యక్తి ఇంట్లో రెండు రోజులు గడిపినట్లుగా మర్పెట్ తెలిపారు. ఆ విషయం విచారిస్తూ ఆ ఊళ్ళోని 8 మందిని తరచి తరచి ప్రశ్నించి అందులో అసత్యమేమీలేదని నిర్ధారించుకున్నారు.

వీరి ఈ అనుభవాలను అమెరికాలో ఒక విజ్ఞాన పరిశోధనా పత్రిక ప్రముఖంగా ప్రచురించింది. అన్ని దేశాలలోని విజ్ఞాన శాస్త్రవేత్తలకు ఈ పత్రిక అందుతుంది.

నిజ జీవితంలో వీరిద్దరూ స్వామి భక్తులయ్యారు. స్వామి లీలలను శాస్త్రజ్ఞులు చూసి ఆశ్చర్యపోవలసిందే కాని, అర్థం చేసుకోలేరని వీరిద్దరి అనుభవాలు ఋజువు చేస్తున్నాయి. ✪

## యక్ష ప్రశ్నలకు సమాధానాలు

"మహాజ్ఞాన మహంకారః
దంభో ధర్మో ధ్వజో చ్ఛ్రయః
దైవం దానఫలం ప్రోక్తం
పై శున్యం పరదూషణమ్."

అవధి మీరిన అజ్ఞానమే అహంకారం. తన్ను తాను మహా ధర్మస్వరూపునిగ ప్రకటించుకోవడమే దంభం. దాన ఫలమే దైవం. ఇతరులను నిందించడమే కొండెకాని తనం.

# అనిర్వాణ్ బాల్

బాల్ (BAUL)అంటే వంగ భాషలో అవధూత అని అర్ధం. ప్రస్తుతం బంగ్లాదేశ్‌లో ఉన్న మైమెన్‌సింగ్ అనే బెంగాలీ గ్రామంలో 1896 జూలై 8న అనిర్వాణ్ జన్మించారు. చిన్నతనం నుండే ఆయన ఏకసంథాగ్రాహి. పదకొండవ యేటనే పాణిని రచించిన 'అష్టాధ్యాయి'ని ఆయన ఒప్పజెప్పేవారు. చిన్నతనంలోనే ఆయన సన్యసించాలనుకున్నారు. కాని ఆయన గురువాయనను చదువును కొనసాగించమనటంతో ఢాకాలోనూ, కలకత్తాలోనూ ఉన్నత విద్యనభ్యసించారు. తరువాత స్వామి నిగమానంద నుండి ఆయన సన్యాసదీక్ష స్వీకరించారు. నిగమానందజీ ఆశ్రమం అస్సాంలోని జోర్హట్ జిల్లాలో కోకిలాముఖి నదీతీరంలో ఉంది. అక్కడ సాధన అంటే యోగం, ధ్యానం కాదు. పరోపకారం, సంఘసేవ - ఇవి ప్రతిఫలాపేక్ష లేకుండా చేయటం. ఆశ్రమం నిర్వహించే పాఠశాలలో అనిర్వాణ్ సంస్కృతం చెప్పేవారు.

అనిర్వాణ్ సన్యాసనామం నిర్వాణానంద సరస్వతి. కొన్నేళ్ళ తరువాత ఆయన సన్యాసాన్ని అధిగమించి 'అనిర్వాణ్' అన్న పేరుతో అవధూతగా మారారు. అన్నిటినీ వదిలి హిమాలయాలకు వెళ్ళి సాధన కొనసాగించారు. అన్ని సంగాలకూ అతీతమైన స్వేచ్ఛను పొంది, ఆనందమే సహజస్థితి అన్న స్థాయికి చేరారు.

ఢిల్లీలో బజార్లవెంట పిచ్చివాడిలా తిరుగుతున్న అనిర్వాణ్‌ను కొందరు గుర్తించి అరవిందుని "Life Divine" పుస్తకాన్ని బెంగాలీ భాషలోకి అనువదించ వలసినదిగా కోరారు. అనిర్వాణ్ వారి కోరికనంగీకరించి ఆ పని చేసిపెట్టారు. ఆయన రచించిన గ్రంథాలలో వేదమీమాంస ముఖ్యమైనది. ఉపనిషత్తులు, గీత, యోగ మొదలయిన వాటిపై ఆయన చేసిన ప్రసంగాలు పుస్తకాలుగా వెలువడ్డాయి.

అనిర్వాణ్ దేశమంతా విస్తృతంగా పర్యటించారు. ఆయన చేసిన ఆఖరు యాత్ర - బదరీ - కేదార్ యాత్ర. అది 1967లో. జీవితమంతా ఆయన స్వయంపాకం చేసుకొనే భోజనం చేస్తూవచ్చారు. తన బట్టలు తానే ఉతుక్కునేవారు. ఆయన ఆస్తి ఒక చేతి కర్ర మాత్రమే.

## భండారు పర్వతాలరావు

'అనిర్వాణ్' సాంఖ్యయోగాన్ని బోధించేవారు. బెంగాలీలోనూ, ఆంగ్లంలోనూ ఆయన ప్రసంగాలూ, రచనలూ చేశారు. 82 ఏళ్ళ వయస్సున 1978 మే 31న ఆయన పరమపదించారు. ఆఖరు క్షణం వరకూ ఆయన జ్ఞాపకశక్తి, తెలివితేటలూ, వివేచనాజ్ఞానము ఏమాత్రం సడలలేదు. పదకొండు సంవత్సరాల పాటు ఆయన సుస్తీగా ఉన్నా ఏ ఒక్కరోజు ఆయన మూలగటం గానీ, బాధపడటం గానీ ఎవరూ చూడలేదు. 'అనిర్వాణ్' అంటే నిర్వచించవీలులేనిది అని అర్ధం. సంసారంతోనే కాక దేహంతో కూడా అన్ని సంగాలూ తెంచుకొని సాక్షి మాత్రంగా జీవించిన ఆ మహాపురుషుడు సాధించిన స్థితి నిజంగా అనిర్వచనీయమే! ★

# సాంస్కృతిక సమారాధన

సంగీత, సాహిత్యాలకు, నాటక రంగానికి మచిలీపట్నం పుట్టినిల్లు. బందరు సాహితీ నందనోద్యాన వనంలో విరిసిన మందారం ఆంధ్రసారస్వత సమితి. 31 సం॥ల క్రితం విజయదశమి పర్వదినాన ప్రారంభమైన యీ సాహిత్య సంస్థ, పావలా సభ్యత్వంతో సాహిత్య గోష్ఠుల్ని నిర్వహించింది. ప్రసిద్ధులైన పండితుల ప్రసంగాలను ఏర్పాటు చేసింది. కథ, కవితల సంకలనాలను, విమర్శ గ్రంథాలను ప్రచురించింది.

ఈ సమితి 30వ వార్షికోత్సవ మహాసభలు డిసెంబరు 19,20,21వ తేదీలలో బందరులో వైభవోపేతంగా నిర్వహింపబడ్డాయి. భగవాన్ శ్రీ సత్యసాయి ఆశీస్సులతో 19వ తేదీ సాయంత్రం ప్రారంభమైన ప్రారంభ సాహిత్య సదస్సు శ్రీ చలమలశెట్టి నాంచారయ్యగారి జ్యోతి ప్రజ్వలనతో మొదలైంది. సమితి గౌరవాధ్యక్షులు శ్రీ బోయిన వెంకటేశ్వరరావు అధ్యక్షత వహించిన ఈ సభలో రాష్ట్ర శాసన సభాపతి గౌ॥ శ్రీ యనమల రామకృష్ణుడు ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. జిల్లా సెషన్సు జడ్జి శ్రీ డి. సత్యనారాయణరెడ్డి సభను ప్రారంభిస్తూ, సామాజిక దృక్పథం లేని కవిత్వం నిష్ప్రయోజనమని, ప్రాచీన కవితారీతుల్ని ఆధునిక కవులు అధ్యయనం చేయాలని తమ సందేశాన్నిచ్చారు.

శ్రీ యనమల రామకృష్ణుడు మాట్లాడుతూ, మన భాష, సంస్కృతి, సంప్రదాయాలను ప్రభుత్వమూ, సాంస్కృతిక, సాహిత్య సంస్థలు పరిరక్షించుకోవాలని, హృదయాన్ని కదిలించేదే సాహిత్యమని, ఈనాడు మంచి సాహిత్యానికి తగినంత ఆదరణ లభించడం లేదని, సమాజ శ్రేయస్సును కాంక్షించే మంచి రచనలను ప్రోత్సహించాలని చెప్పారు. ప్రముఖ నవలా రచయిత్రి శ్రీమతి మన్నెం శారద మాట్లాడుతూ భాషపట్ల అవగాహన లేనివారు, సాహిత్య పరిజ్ఞానం లేనివారు, ఈనాడు రచయితలుగా పరిగణింపబడడం శోచనీయం అన్నారు. వేదకాలంలో స్త్రీలు' అనే అంశంపై డా॥ బి. సుశీల ప్రసంగిస్తూ, మాతృదేవతను మించిన దైవం లేదని, సర్వేజనా స్సుఖినోభవన్తు, సమస్త సన్మంగళాని భవన్తు మొదలైన సూక్తులు ఋగ్వేదం నుండి వచ్చినవేనన్నారు. "జానపద కళారీతులు' అనే విషయంపై తెలుగు విశ్వవిద్యాలయం రీడరు డా॥ జయాసలోమి ప్రసంగిస్తూ జానపద కళారీతులు మన సంస్కృతిలో ప్రధానమైనవని, అవి అంతరించి పోకుండా కాపాడుకోవాలని, వాటి అభివృద్ధికి, తెలుగు విశ్వవిద్యాలయం చేపట్టిన అధ్యయన తరగతుల గురించి వివరించారు. సమితి కార్యదర్శి శ్రీ కొట్టి రామారావు తమ నివేదికలో గత 30 ఏళ్ళుగా సమితి నిర్వహించిన సాహితీ కార్యక్రమాలను వివరించారు.

20వ తేదీ ఉదయం జరిగిన గ్రంథావిష్కరణ సదస్సుకు డా॥ఎ. అశ్వనీకుమార్ అధ్యక్షత వహించారు. ముఖ్యఅతిథిగా పాల్గొన్న శ్రీ జి. హరగోపాలకృష్ణ ప్రసంగిస్తూ బందరులో వివిధ సాహిత్య, సాంస్కృతిక సంస్థలు కార్యక్రమాలను విస్తృతంగా ఏర్పాటు చేయడం మంచి పరిణామమని, మచిలీపట్నం సాంస్కృతిక రాజధాని కావాలని ఆకాంక్షించారు. తొలుత శ్రీ పి. శేషగిరిరావు (అడిషినల్ యస్.పి.) సభను ప్రారంభిస్తూ సాహిత్యం సర్వజనహితాన్ని కోరాలని, సమాజానికి మంచిని బోధించాలని, వేమన, సుమతీ శతక పద్యాలను సోదాహరణగా వివరించారు. ఆచార్య కోట సుందర రామ శర్మగారు రచించిన "శివమహిమ్నస్తోత్రం", "సుందరా నందము" అనే రెండు గ్రంథాలను సర్వశ్రీ కాశీనాధుని పూర్ణమల్లికార్జునుడు, డా॥బి. ధన్వంతరీ ఆచార్య ఆవిష్కరించగా, సర్వశ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి, రావిరంగారావులు గ్రంథ సమీక్ష చేశారు. శ్రీ కోట సుందర రామశర్మగారికి సహస్ర చంద్ర దర్శన మహోత్సవం జరిగింది. దీని ప్రాధాన్యతను గురించి డా॥ చిట్టావూరి శివరామకృష్ణ వివరించారు. మనిషి ఔన్నత్యానికి, సర్వ పాపహరణకు యిది దోహదపడుతుందని చెప్పారు.

## బ్రౌన్ గ్రంధాలయ భవన విస్తరణ

సి.పి.బ్రౌన్ గ్రంధాలయాన్ని పొట్టి శ్రీరాముల తెలుగు విశ్వ విద్యాలయం పరిశోధనా కేంద్రంగా గుర్తించుటతో పాఠకుల సంఖ్య నానాటికీ పెరుగుతూ ఉన్నందున ప్రస్తుత భవనంపై మరో అంతస్థు నిర్మాణం జరుగుతున్నది. ఇది వరలో ఇన్‌చార్జ్ కలెక్టరు ఎ. గిరిధర్‌గారు ఈ నిర్మాణానికి రెండున్నర లక్షల ఆర్థిక సహాయం అందచేశారు. పై అంతస్థులో పరామర్శన విభాగము, పరిశోధక విద్యార్థులకు మూడు విడిది గదుల నిర్మాణము కోసం ప్రస్థుత కలెక్టరు శ్రీ వి. నాగిరెడ్డి గారు జన్మభూమి నిధుల క్రింద ఒక లక్ష రూపాయిలు మంజూరు చేసినందులకు ట్రస్టువారు తమ కృతజ్ఞతలను తెలిపారు. పై అంతస్థులో ఒక్కొక్క గది నిర్మాణానికి విరాళాలు ఇచ్చిన దాతల పేరున శిలాఫలకము ఉంచెదమని అందుకు సాహిత్యాభిమానులు, వదాన్యులు ఉదారంగా విరాళాలు అందజేసి ఈ వాగ్దేవి మందిర నిర్మాణానికి సహకరించవలసినదిగా విన్నవిస్తున్నాను.

**- జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

20వ తేదీ సాయంత్రం జరిగిన "సాహితీ సౌరభం" సదస్సుకు సమితి అధ్యక్షులు శ్రీ జి.సత్యనారాయణ అధ్యక్షత వహించగా, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా॥ సి.నారాయణరెడ్డి ముఖ్యఅతిధిగా పాల్గొని, సాంస్కృతిక విజ్ఞానం, సాంకేతిక విజ్ఞానం రెండు రెక్కలుగా ఉన్నప్పుడే రాష్ట్రాభివృద్ధి సాధ్యమవుతుందని, ఈ రెండు రెక్కలలో ఏదిపోయినా అభివృద్ధి కుంటుపడుతుందని రాష్ట్ర సాంస్కృతిక మండలి ఆధ్వర్యంలో హైదరాబాదులో కల్చరల్ కాంప్లెక్స్‌ను నిర్మించదలచామని, గతంలో సాహిత్య, సాంస్కృతిక, లలితకళల అకాడమీలు నిర్వహించిన పాత్రను ఈ "కళ సముదాయ భవనంలో నిర్వహిస్తామని చెప్పారు. ఆంధ్రప్రదేశ్‌లో సాహిత్యసేవ చేస్తున్న రెండే రెండు సంస్థలలో, రాష్ట్ర రాజధానిలో 50 సంవత్సరములుగా ఉన్న ఆంధ్ర సారస్వత సమితి పరిషత్తు ఒకటని, రెండవది సాంస్కృతిక రాజధాని అయిన మచిలీపట్నంలోనే ఆంధ్రసారస్వత సమితి అని ప్రశంసించారు.

రాష్ట్ర ఎక్సైజు శాఖామాత్యులు శ్రీ నెట్టెం రఘురాం సభను ప్రారంభిస్తూ, తమ తాత, తండ్రులు గొప్ప కవులని సాహితీవేత్త కావాలన్న తమకోరిక, రాజకీయాల్లో దిగిన తరువాత తీరని కోరికగా మిగిలిపోయిందని చెప్పారు. ఈ సదస్సులో సమితికి చేసిన సేవలకు కృతజ్ఞతలతో శ్రీ బోయిన వెంకటేశ్వరరావుగారికి విశిష్ట సన్మానం జరిగింది. పట్టణ వివిధ సంస్థలు యిందులో పాల్గొన్నాయి.

మూడవరోజు 21వ తేదీ ఉదయం ధార్మిక సాహిత్య సదస్సు జరిగిం[illegible]. ఇది సమితి, తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మ ప్రచార పరిషత్తు - సంయుక్త ఆధ్వర్యంలో నిర్వహింపబడింది. దీనికి సమితి ఉపాధ్యక్షులు, శ్రీవాణి సంపాదకులు శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావుగారు అధ్యక్షత వహించారు. వారి అధ్యక్షోపన్యాసంలో "ఆధ్యాత్మికత అంటే భజనలు, యజ్ఞాలు, పుణ్యక్షేత్రాల సందర్శనే కాదనీ, మనిషి 'మనీషి' ఎదగడానికి మన సంస్కృతీ, సాహిత్యాలు దోహదపడాలని, సామాజిక స్పృహను కలిగించే శక్తి రామాయణ, భారతాలకు ఉందని, నైతిక విలువల్ని కాపాడుకోవడం మనందరి కర్తవ్యమని వివరించారు. రామాయణం - ఆర్షధర్మం" అన్న విషయంపై శ్రీ మొవ్వ వృషాద్రిపతి అనర్గళంగా మాట్లాడుతూ రామాయణంలోని ఔన్నత్యాన్ని, పాత్రల విశిష్టతను సోదాహరణంగా అనేక శ్లోకాలను ఉటంకిస్తూ ప్రసంగించారు. "భాగవత-భగవద్గీతల సమన్వయం" అన్న అంశంపై శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గంభీరోపన్యాసం చేస్తూ భగవద్గీతను లక్షణంగా, భాగవతాన్ని లక్ష్యంగా ఎన్నో ఆధ్యాత్మిక రహస్యాలను విపులీకరించి, మన సంస్కృతికి పట్టుగొమ్మలైన భాగవత, భగవద్గీతలను పఠించవలసిన ఆవశ్యకతను విశదీకరించారు.

21వ తేదీ మధ్యాహ్నం కవితాసదస్సు జరిగింది. సమితి వ్యవస్థాపక అధ్యక్షులైన ప్రముఖ కవి, విమర్శకులు శ్రీ అద్దేపల్లి రామమోహనరావు అధ్యక్షత వహించిన యీ

సభలో శ్రీ పణికుమార్, (డిప్యూటి కమీషనర్ కమర్షియల్ టాక్సెస్) మాట్లాడుతూ, కవితాబీజం పాఠకుని హృదయంలో మహావృక్షమై ఎదగాలని, గత అయిదారు సంవత్సరాలనుండి మంచి సాహిత్యం అనేక పాయలుగా సాగుతోందని, అన్ని పాయల మధ్య అవగాహన ఉన్నప్పుడే అది ప్రవాహమవుతుందని, కవుల సంకలనాలకు 'ముందుమాట' అనవసరమని, మనం 'ఎటువెళ్తున్నాం', ఎటు వెళ్ళాలి' అని నిర్ణయించుకొని, కవితా ప్రయాణం చేయాలని యువకవులకు తమ సందేశాన్నిచ్చారు. శ్రీ అద్దేపల్లివారు మాట్లాడుతూ, నిజమైన సాహిత్య ప్రియుడికి, సాహిత్యం సృష్టించేవాడి మీద అభిమానం ఉండాలని, అలా లేని అస్తవ్యస్థ పరిస్థితి నేడు గోచరిస్తున్నదని, ఫలితంగా సాహిత్యం దిగజారి పోతున్నదని ఆవేదన వెలిబుచ్చారు. కవితా పఠన కార్యక్రమాన్ని నిర్వహించిన డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు మాట్లాడుతూ పట్టణంలో సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలు విజయవంతంగా జరుగుతున్నాయని, వీటి మధ్య అవగాహన ఆరోగ్యకరమైన పరిణామమని ప్రశంసించారు. కవితా గోష్ఠిలో 40 మందికి పైగా కవులు పాల్గొని స్వీయకవితాగానం చేశారు.

21వ తేదీ సాయంత్రం ముగింపు సభకు అధ్యక్షత వహించిన ఆచార్య గంగప్ప మాట్లాడుతూ, తెలుగు నాటకానికి పూర్వ వైభవం తెచ్చేందుకు కళాకారులందరూ సమష్టి కృషి చేయాలన్నారు. ఆయన సమితి వెలువరించిన ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. డా॥బి. సాయికృష్ణ యాచేంద్ర (వెంకటగిరి) సంగీత గేయధార అవధానానికి సమన్వయ కర్తగా డా॥మంగళగిరి ప్రమీలాదేవి వ్యవహరించగా పృచ్ఛకులుగా సర్వశ్రీ అద్దేపల్లి రామమోహనరావు, కె.వై.యల్. నరసింహం, స్వర్ణరాజ హనుమంతరావు, చిట్టా గోపాలకృష్ణమూర్తి, 'నవ్యకవి' నాదెళ్ళ పురుషోత్తమశాస్త్రి, శ్రీమతి యన్. వరలక్ష్మి పాల్గొన్నారు. ఈ అవధాన రూపకల్పనలో రాగ,తాళ, భావ సమ్మేళనాన్ని సాధించడం ఒక ప్రత్యేకత. డా॥ యాచేంద్ర శ్రావ్యమైన సంగీత గేయధార రసజ్ఞులను విశేషంగా ఆకర్షించింది. ఈ అవధానాన్ని బందరులో నిర్వహించడం ఇదే ప్రథమం. శ్రీ అద్దేపల్లి వర్ణనాంశాన్ని యిస్తూ "నిశీధిలో ఆత్మహత్యకు వెళ్తున్న స్త్రీని ఎలా ఓదార్చి, వెనుకకు మరల్చ వచ్చునో' వర్ణించమని అడిగారు. "నిశీధి సమయంలో నిరాశ చెందకూ" అంటూ "చీకటి కడుపున వేకువ, దాగి ఉందని తెలుసుకో" అని అద్భుతంగా అవధానిగారు పూరించారు. రాగ,తాళ నిర్దేశాన్ని శ్రీ చిట్టా గోపాలకృష్ణమూర్తి చేయగా, పల్లవి పూరణ అంశాన్ని శ్రీ నాదెళ్ళ నిర్వహించారు. ఆశువు అంశాన్ని శ్రీ స్వర్ణరాజ నిర్వహించగా, పదనిషేధాన్ని శ్రీ కె.వై.యల్. నిర్వహించారు. శ్రీమతి వరలక్ష్మి, 'ఇష్టపది' అంశంగా గీతాన్ని, సంగీతాన్ని సమన్వయించి చెప్పమని కోరగా "గీతమే సంగీతం - సంగీతమే గీతం" అంటూ మధురంగా పూరించి, అవధాని, శ్రోతలకరతాళ ధ్వనులతో వారి ప్రశంసల్ని పొందారు. ఆద్యంతమూ హృదయంగమంగా సాగిన యీ గేయధార మన సంస్కృతికి ప్రతిబింబంగా సాగింది.

మూడురోజులు జరిగిన సదస్సులో మన సంస్కృతీ పరిరక్షణ ప్రధానాంశంగా పేర్కొనబడింది. బందరు పట్టణం పులకించి, సభలను తిలకించింది.

- జీసనారా

## శ్రీవాణి జీవిత సభ్యులు



శ్రీ మోదేకుర్తి నరసింగరావు
విజయనగరం - 531 203



శ్రీమతి &శ్రీ పాలూరి రాంబాబు
పెంటపాడు, ప॥గో॥జిల్లా



శ్రీ బి.సిహెచ్. సన్యాసినాయుడు
విశాఖపట్నం - 533 016

# ఆగంతకుడు

గుంటూరు దగ్గర సీతానగరంలో అంజలి, కాంతారావు అనే భార్యాభర్తలు ఉండేవారు. కాంతారావు సీతానగరం కరణం. అంజలి, కాంతారావు యిద్దరూ శ్రీ సత్యసాయిబాబా భక్తులు. వాళ్ళ ఇంటిలో ప్రతి రోజూ శ్రీ సత్యసాయిబాబాకి పూజలు జరుగుతూనే ఉండేవి. ఒకసారి కాంతారావుకి కామెర్లు వచ్చినవి. తగ్గితే గుంటూరులోని నీ భజన మందిరానికి వచ్చి నీ భజనలో పాల్గొంటాం" అని శ్రీ సత్యసాయిబాబాకి మొక్కింది అంజలి. వారం రోజులలో కాంతారావుకి కామెర్లు తగ్గినవి. కాంతారావుకి బాగా కులాసా చిక్కిన తరువాత, ఒక సాయంకాలం కాంతారావు అంజలితో మోటారు సైకిల్ మీద గుంటూరులో శ్రీ సత్యసాయిబాబా భజన మందిరానికి వెళ్ళారు. భజన అయిపోయే సరికి బాగా చీకటి పడింది. తిరిగి కాంతారావు మోటార్ సైకిల్ మీద అంజలితో సీతానగరం బయలుదేరాడు.

గుంటూరు పొలిమేరలు దాటగానే "మణికట్టు బెణికింది." అన్నాడు కాంతారావు. "అయితే కొంచెం సేపు మీరు వెనకాల కూర్చోండి మోటార్‌సైకిల్ నేను నడుపుతాను" అన్నది అంజలి. కాంతారావు మోటార్ సైకిల్ మీద వెనకాల కూర్చోగా అంజలి మోటార్‌సైకిల్ తానే నడుపసాగింది. పెనుమాక దగ్గరకు వచ్చిన తరువాత వాళ్ళకి తెల్లటి లాల్చీ, తెల్లటి పంచె ధరించిన యాభై సంవత్సరముల వృద్ధుడు కనిపించేడు. ఆ ఆగంతకుడు మోటారు సైకిల్, ఆపి, "నేనూ సీతానగరం వస్తున్నాను. దయచేసి నన్నూ మీతోపాటు సీతానగరం తీసుకువెళ్ళ గలరా?" అన్నాడు. కాంతారావు ఆయన్నికూడా "వెనకాల కూర్చోమన్నాడు. ఆగంతకుడూ, కాంతారావు మోటార్ సైకిల్ మీద వెనకాల కూర్చోగా అంజలి మోటార్ సైకిల్ తనే నడుపసాగింది.

మోటార్ సైకిల్ పొల్కంపాడు చేరిన తరువాత ఆరుగురు దొంగలు మోటార్‌సైకిల్ ఆపి ముగ్గురిని కర్రలతో కొట్టి, వాళ్ళ దగ్గర ఉన్న డబ్బూ, నగలూ, మోటారు సైకిల్‌తో సహా మొత్తం అపహరించి పొలాలలోకి వెళ్ళిపోయినారు. ముగ్గురూ రక్తం ఓడుతున్న గాయాలతో రోడ్డు మీద కూర్చున్నారు. అంజలీ, కాంతారావూ ఏడవసాగారు. ఆగంతకుడు "ఆగండి. దొంగలపై సమ్మోహన మంత్రాన్ని ప్రయోగిస్తాను" అంటూ ఒక మంత్రం పఠించి దొంగల దిక్కుగా నోటితో ఊదేడు. ఆగంతకుడూ, అంజలీ, కాంతారావూ ముగ్గురూ దొంగలు వెళ్ళిన దిక్కుగా పొలాలలోకి నడిచేరు. అక్కడ దొంగలు వాటాలు కుదరక కర్రలతో కొట్టుకుంటున్నారు. అంజలి కనిపించగానే దొంగల నాయకుడు. "ఇవిగో మీ నగలూ, మీ డబ్బూ. మీ మోటార్ సైకిల్ మీద మీరు వెళ్ళిపోండి. ఈ వెధవల సంగతి నేను చూస్తానులే అమ్మా" అన్నాడు. డబ్బు, నగలు చేజిక్కించుకొని, తిరిగి అంజలి మోటారుసైకిల్, నడుపు తుండగా, కాంతారావూ, ఆగంతకుడూ ముగ్గురూ తిరిగి సీతానగరం దిశగా బయలుదేరారు.

మోటారుసైకిల్ సీతానగరం పొలిమేరలకు చేరగానే ఆగంతకుడు "ఇంకనేను దిగుతాను" అన్నాడు. అంజలి మోటారుసైకిల్, ఆపగా ఆగంతకుడు దిగి చీకటిలో కలిసిపోయేడు. అంజలీ, కాంతారావు మోటారుసైకిల్ మీద తమ యింటికి చేరారు.

మరునాడు ఉదయం శ్రీ సత్యసాయిబాబా పూజకు కూర్చున్న అంజలీ, కాంతారావూ యిద్దరూ గమనించేరు. పూజామందిరంలో ఉన్న శ్రీ సత్యసాయి బాబా బొమ్మ బట్టలనిండా చిరుగులూ, రక్తపు మరకలు. రాత్రి తమతో మోటారుసైకిల్ మీద వచ్చిన ఆగంతకుడు శ్రీ సత్యసాయిబాబాయే అనీ, శ్రీ సత్యసాయిబాబా వలననే తమ నగలూ, డబ్బూ, మోటారుసైకిల్ తమకు దక్కాయని అంజలీ, కాంతారావూ యిద్దరూ గ్రహించారు. ఇద్దరూ మనస్ఫూర్తిగా శ్రీ సత్యసాయిబాబాకి నమస్కరించేరు.

- శ్రీమతి చింతపల్లి అన్నపూర్ణ



# శ్రీ శివసాయి రియల్ ఎస్టేట్స్

కరెంటు ట్రాన్స్‌ఫారం దగ్గర, బస్సుస్టాండ్ ప్రక్కన

**పుట్టపర్తి - 515 134**

*ప్రశాంతి నిలయం S.S. హాస్పిటల్, M.R.O. ఆఫీస్,*
*గోకులం దగ్గరలో గల ప్లాట్స్, అపార్టుమెంట్స్, ఫారం లాండ్స్ అమ్మకము*
*మరియు కొనుగోలుకు సంప్రదించండి.*

## వాయిదా పద్ధతిపై ప్లాట్లు లభించును.

***కేవలం ఒక్కసారి రు. 5116/- (ఐదువేల నూటపదహార్లు) చెల్లించినచో సంవత్సరమునకు 30 రోజుల వంతున 10 సం॥ల వరకు ఉచిత వసతి సౌకర్యము (ప్రశాంతి నిలయం R.T.C. బస్సుస్టాండ్ దగ్గరలో) లభించును.***

***ఒక్కసారి రూ. 10,116/- లు చెల్లించిన 10 సంవత్సరముల వరకు ప్రతి సంవత్సరమునకు 60 రోజుల వంతున డోర్ నెం. 324, కుమార్ విలాస్ పై రెండు అంతస్తులు, గోపురంగేటు ప్రక్కన, గోపురంరోడ్ వద్ద ఉచిత వసతి సౌకర్యము లభించగలదు.***

**కేవలం రు. 85,000 లకు అపార్టుమెంట్స్ లభించును.**

*ఇందులో ఎయిర్ కండీషన్డ్ రూములకు, ఇతర వివరములకై*
*ఈ క్రిందివారిని సంప్రదించవలెను*

**శ్రీ శివసాయి అకామిడేషన్స్**
**అతిత్వరలో ప్రారంభం**
**కాబోతున్నది.**
**త్వరపడండి!**

ప్రొప్రయిటర్స్ :

గ్రంధి యుగంధర్

చుండూరి వెంకటేశ్వరరావు B.A

Postal Registered
No.H/M.P.M./34, Dt. 10-12-1984

SREEVANI
January '98

Regd. with Registrar of News
Papers Regd. No. 45039/85



EDITED, PRINTED AND PUBLISHED BY SRI KOMARAGIRI KRISHNA MOHAN RAO

*Printed at Sreevani Offset Printers, Machilipatnam - 521 001 Ph 21137*